బాలానంద

# శ్రీశైలక్షేత్రమహాత్మ్యం



నాగశ్రీ

ప్రథమ ముద్రణ
1986

ముఖచిత్రం:
వి. యస్. ప్రకాష్

ప్రచురణ :
నవరత్నా బుక్ సెంటర్
ఏలూర్ రోడ్, విజయవాడ-2

ముద్రణ :
"వెంకటరత్నా"
విజయవాడ-2

వెల : రు. 10-00

# విషయసూచిక

# శ్రీశైల క్షేత్ర పురాణము

## శ్రీ శైలక్షేత్ర ప్రభావము

శ్రీశైల శిఖరం చూచినంత మాత్రాననే మళ్ళీ జన్మయెత్తే పనిలేకుండ ముక్తి లభిస్తుందన్న దొక్క చెదనిముద్ర. అది యీనాటి మాటకాదు-- ఒక నోటిమాటా కాదు. యుగయుగాలుగా జగజగాలలో తరతరాల వారంటు న్నారు—ఆనాటినుండి యీనాటివరకు వింటున్నారు; అరుణాచలంతో దైవ నామస్మరణం చేస్తే మోక్షం కలుగుతుంది. వారణాశిలో చనిపోతేనే ముక్తి లభిస్తుంది. కాని యీ శ్రీశైల మాహాత్మ్యం మలాంటిదికాదు. క్షేత్రం చేరక పోయినా స్మరణ చేయకపోయినా. మరణం చెందకపోయినాసరే కనుచూపు దూరాన నుండి శిఖరం చూచినంత మాత్రాన పునర్జన్మయుండదని పరమ శివ యోగులన్నమాట—ఆ మాటకెంత పొరపాటుండదు.

భారతదేశంలో శ్రీశైలమనే పుణ్యస్థల మింకొకటి చిత్తూరు జిల్లాలో నున్నది. అది విష్ణుక్షేత్రం. దానినే తిరుపతి దేవస్థానమని చెప్పకుంటున్నాం. అక్కడ లక్ష్మి పద్మావతీ సమేత వేంకటేశ్వరస్వామి వేంచేసి యున్నాడు. ఆయనకే అడుగడుగులవాడు, ఆపద మొక్కులవాడు, వడ్డీముడుపులవాడు, ప్రాతప్పులవాడు, ఏడుకొండల వెంకన్న అనే పేరు లెన్నెన్నో యున్నవి.

అలాగే గుంటూరు మండలంలోని కృష్ణానదీ తీరాన నున్న శ్రీశైలమొక బౌద్ధక్షేత్రం. దానికిగల ప్రచారక నామం నాగార్జునకొండ. పూర్వమొప్పుడక్కడ నివశించిన నాగార్జునాచార్యుడు గొప్ప యాగశాలలు నిర్మించడమేగాకుండ విశ్వవిద్యాలయంగూడ నెలకొల్పాడు. ఆయన కాలంలో అదొ ప్రఖ్యాత బౌద్ధారామక్షేత్రంగా గణనకెక్కింది. ప్రస్తుతమక్కడ మనభారత ప్రభుత్వం వారిచే నాగార్జునసాగర్ నిర్మింపబడింది. నాగార్జున సాగర్ నీటి పారుదల ఫలితంగా రాయలసీమ ప్రాంతం రత్నాలు పండే భూమిగా రూపురేఖలు దిద్దుకుంది.

మన మిప్పుడు చెప్పుకునేది మూడవ శ్రీశైలక్షేత్రం.

ఇది కర్నూలు మండలంలోని నందికొట్కూరు తాలూకాలో వెలుగొందుతూంది. ఇదికూడ ప్రసిద్ధ శివక్షేత్రమే. చాల పురాతనమైనది, ఇచటి క్షేత్రపాలకుడైన శ్రీభ్రమరాంబా సమేత మల్లికార్జునస్వామి మహామహిమ సంపన్నుడు. ఈ మూడు శివక్షేత్రాలూ దక్షిణ భారతదేశంలోనివే. అయినా శ్రీశైల మనినంతనే ప్రతివారి మనసూ భ్రమరాంబాదేవివైపు పయనిస్తుంది. శ్రీశైలక్షేత్ర పురాణ కథలెన్నో యున్నవి.

## వినాయకుని పెండ్లి వినోదము

చాలకాలం నాటి చల్లనిమాట; పార్వతీ పరమేశ్వరు లిరువురూ కైలాసంలో వున్నారు. కుమారస్వామి వినాయకు లిద్దరు వారిముద్దు కుమారులు.

నందీశ్వర భృంగీశ్వర చండీశ్వరులు నమ్మిన బంట్లు ప్రమధగణం పాలిత ప్రజలు. హిమాచలం నివాస నగరం. ఐతే ఒకానొక సమయాన కుమార స్వామి వినాయకులకు వప్పందం వచ్చింది. నా పెండ్లిముందు జరగాలంటే నా పెండ్లి ముందు జరగాలని జగడాలాడకో సాగారు. శంకరున కేదీ పాలు పోక "అబ్బాయిలూ! మీలో యెవరైతే ముందుగ భూప్రదక్షణచేసి వస్తారో వానికి ముందు పెండ్లి చేస్తా" నని ఒప్పంద మయ్యాడు. ఇకనేం? కుమార స్వామి తన నెమలి వాహనం యెక్కి భూప్రదక్షణం చేయడానికి బయలు దేరాడు.

ఇక పోతే వినాయకుని వాహనం చిట్టెలుక, చిట్టెలుక నిజానికి గట్టిదే కాని, అది నెమలిలాగ పైకెగరలేదు. పడివడిగా పరుగెత్తనూ లేదు. కుమార స్వామితో పోటీ చేయలేనని దిగాలుపడి పోయాడు. ఐనప్పటికిపొట్టివానికిజిత్తు లెక్కువ కనుక మంచి యుపాయం తోచింది. చివాలున లేచి చక్కగస్నానం చేసి మడిబట్టలు కట్టుకుని; బొట్టు పెట్టుకుని వచ్చాడు. నారదాది మునీంద్రు లతో సభదీరి కూర్చుండి యున్న పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడు ప్రదక్షణలు చేసి చేతులు ముకుళించుకుని నిలుచున్నాడు.

పరమేశ్వరు డదిచూచి "నీకేంకావాలి?" అన్నాడు.

వినాయకుడు వినయంగ "వివాహం కావాలి" అన్నాడు.

"నీవు భూప్రదక్షణ చేసి వచ్చావా?" అన్నాడు శంకరుడు.

"ఇపుడేగద నాన్నగారూ! ముమ్మారు చేశాను" అన్నాడు గణపతి.

సాంబశివు డాలోచనలో పడ్డాడు.

నిజానికి సభలోని వారుకూడ తికమక పడసాగారు.

పార్వతీదేవికి నవ్వువచ్చింది. "ఔనండీ! తల్లిదండ్రులకు ప్రదక్షిణ చేస్తే భూప్రదక్షిణచేసినట్లేనని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయిగదా!" అన్నది పరమేశ్వరుడుగూడ మెచ్చుకొని వినాయకుని పెండ్లి చేయడానికిసరేనన్నాడు. మరి పెండ్లి చేయడానికి పెండ్లికుమార్తె యెవరన్న ప్రశ్న వచ్చింది. ఆ సభలో కూర్చుండి యున్న బ్రహ్మదేవుడు "నా కుమార్తెలను నీ కుమారునికి కన్యాదానం చేస్తాను పశుపతీ" అన్నాడు. వెంటనే సుముహూర్తం నిశ్చయింప బడింది. కైలాసనగరంతో బ్రహ్మకుమార్తెలైన బుద్ధి సిద్ధి యనే యిద్దరు కన్యలనిచ్చి వినాయకుని కల్యాణ మతివైభవంగా చేశాడు పరమేశ్వరుడు.

భూప్రదక్షిణ ముగించుకుని యింటికి వచ్చిన కుమారస్వామికి తమ్ముని పెండ్లయిన విధం తెలిసింది. స్కందు డంత కష్టపడినప్పటికిని ఫలితం దక్కకపోయినందున చింతపడి కైలాసంలో ఉండలేక యీ శ్రీశైలం మీదకు వచ్చి తిష్టవేశాడు. అలిగిపోయిన పెద్దకుమారుని మీది మమకారం కొలది గౌరీ శంకరులుగూడ వారి నగరంనుండి సరాసరి యిక్కడకు వచ్చి కుమారుని యింటికి రమ్మని బ్రతిమిలాడారు. షణ్ముఖుడంగీకరింప నందున వారిద్దరిక్కడనే కొంతకాలముండ వలసి వచ్చింది.

## కుమారస్వామి కల్యాణము

గౌరీ శంకరులు లేని కైలాసం చిన్నపోయింది. ప్రమథగణమంతా భవానీ భవులు భూలోకంలో శ్రీశైలం మీద నున్న వార్త తెలుసుకొని దిగి

వచ్చింది. ఆ సమయంలో దేవతలు గంధర్వులు కిన్నెరులు కింపురుషులు సిద్ధులు సాధ్యులు మొదలైన వారంతా గౌరీశంకరులను గురించి వస్తూ పోతూన్న కారణంగా శ్రీశైలమూనాడే దేవమునీంద్రుల యాత్రాస్థలంగా మారిపోయింది. మరికొంత కాలానికిది భూలోక కైలాస మనిపించుకుంది.

కొద్దిరోజులు గడిచినై.

లక్ష్మీనారాయణుల ముద్దుల కుమార్తె శ్రీవల్లిని కుమారస్వామికి యిచ్చి వివాహం చేయడానికి నిశ్చయమయింది. సంబరాలు పడస్కందుడు యెవరికి చెప్పకుండానే తిరిగి కైలాసానికి పోయి కూర్చున్నాడు. శాంభవీ శంభు లింతకుముందు సరస్వతీ బ్రహ్మలతో వియ్యంచేశారు— యిప్పుడు రమా నారాయణులతో వియ్యం చేయబోతున్నారు. పెండ్లిని గురించి ఆది దంపతులు మళ్ళీ శ్రీశైలం నుండి కైలాసానికి తరలారు. అదిచూచిన దేవ మునీంద్రాదులు సమీపించి "సాంబశివా! ఇంతకాలంగా మాకు మీ దర్శన భాగ్యం లభించి మేము కృతకృత్యులమయ్యాం. మీరు తిరిగి పోవడం మాకు తృప్తికరంగలేదు. లోకకల్యాణార్థం మీ దంపతు లిక్కడనే తిరవాస వాస ముంటా మని వర మీయండి" అని పాదాక్రాంతు లయ్యారు.

పరమేశ్వరు డనుగ్రహించి "ఆత్మీయులైన మీ యభిసంధి నేను నిరాకరింప గలనా! మన శ్రీ వళ్ళీకుమారుల కల్యాణానంతరంమేము తప్ప కుండ వచ్చి యిక్కడనే వుంటాం" అని వారికి వాగ్దానంచేసి కైలాసానికి పోయారు. సమస్తదేవగణం—మునిగణం నమీకరించి యుండగ కుమారుని వివాహం జరిగింది. అటుపిమ్మట కొద్దిరోజులతోనే కుమారస్వామి దేవేం

ద్రుని సర్వసేనా నాయకత్వం వహించి స్వర్గలోకం వెళ్ళాడు. వినాయకుడు విఘ్నాధి పతిత్వం పొంది సమస్తలోకాలలో ప్రధమపూజ లందుకుంటు న్నాడు. ఆదిదంపతు లానాడు మునుల కిచ్చిన మాటప్రకారం శ్రీశైల శిఖరంమీద భ్రమరాంబా మల్లికార్జునులై నిలిచేలోపల యింకా కొన్ని సంఘటనలు జరిగినై.

## శివుని మెప్పులొందిన శిలాదుడు

సృష్టి ప్రారంభమైన మొదటికాలంలో శిలాదుడనే శివభక్తుడున్నాడు. ఆయనకు కోపమంటే యెలాంటిదో తెలియనే తెలియదు. యెంత భరింపరాని కష్టమొచ్చినా జంకేవాడుకాదు ప్రతిదినం నియమంతప్పకజపతపయోగాభ్యాలు చేస్తూంటాడు. ఆయన భార్యగూడ చాల ఉత్తమురాలు. వారింటిలో లేని ఓషధులంటూ లేవు.

ఐనా వారికి సంతానం లేకపోయింది. కొడుకులు కావాలన్న కోరికతో గాలకాలం శివుని గురించి తపసుచేశారు. ఎంత ఎండకాచినా తాపంచెందక— ఎంత వాన కురిసినా తడిచాననక—ఎంతగాలి వీచినా చలింపక చేస్తూన్నవాని తపోదీక్ష కానందించిన శంకరుడు ప్రత్యక్షమై "శిలాదా! చలనంలేని నీ భక్తికి సంతోషించాను. నీకే వరమడిగినా కాదనక యీయదలంచాను. నీకు కావలసిన వాని నడిగి పుచ్చుకొ"మ్మన్నాడు. సాంబశివుని మాటలలో భక్త వాత్సల్యముట్టిపడుతూంది.

శిలాదుని దేహమానంద తరంగాలలో తేలియాడింది. సదాశివమూర్తికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించిన యనంతరమున కరములు ముకుళించి "పరమేశ్వరా! పుట్టిన వారెన్నటికైన గిట్టక తప్పదు. అది ప్రకృతి లక్షణం. ఐతే పుడమిమీద పుట్టినందుకు, పెరుగినందులకు గూడ మానవుడు చరితార్థుడు కావాలన్నదే నాయాశయం. కనుక ఏ పాపమూ చేయనివాడు, ఏనాడూ నీ సన్నిధినుండి వీడిపోనివాడు. ఎప్పుడూ నీ సేవా వృత్తిలోనే జీవించి మమ్ముతరింప జేయువాడు నైన గుణవంతుడగు నొక్క కుమారుని ప్రసాదించు. నా కంతకంటె కోరదగింది—పొందదగింది లే"దన్నాడు.

ఆ మాటల కభవు డబ్బుర పడ్డాడు. "శిలాదా! దురాశ లేని దొడ్డ వాడవు. స్వార్థం కోరని త్యాగమూర్తివి. నీ యభిమతంలో తప్పులేదు—నీ వడిగిన దానిలో ముప్పులేదు. నీ మంచితనం నన్నెంతగానో ముగ్ధుడ్ని చేసింది. మంచి గుణములు గలిగి, నా సేవలో నిమగ్నుడై నిన్ను తరింప జేయు కుమారుడొక్కడు చాలని నీవడిగావు. కాని నేను నీకలాంటి కుమారుల నిద్దర నిచ్చుచున్నాను. నీ సంకల్పం తప్పక నెరవేరు తుం"దని చెప్పి యదృశ్యమయ్యాడు. తరువాత శిలాదుని భార్య గర్భవతియై యిరువురు కుమారుల గన్నది. ఆదంపతులు వారికుమారులకు పర్వతుడు నందీశ్వరుడని నామకరణములు చేసి మహానందంగా పెంచుకుంటున్నారు.

కుమారు లిద్దరూ పెరిగి పెద్దవారయ్యారు.

# సిద్ధి పొందిన శిలాదుని కుమారులు

శిలాదుని కుమారు లిద్దరూ బుద్ధిమంతులు. మొదటినుండి తల్లిదండ్రుల అదుపాజ్ఞలలో పెరిగారు. చదువు సంధ్యలు నేర్చుకున్నారు-సంస్కార పరు లయ్యారు. ప్రపంచంలోని మంచిచెడ్డలు తెలుసుకున్నారు. పరమేశ్వరాను గ్రహం పొంది కైవల్యం చెందక పామరుల్లా పుట్టుచు పెరుగు చచ్చుచు గర్భనరకము అనుభవించడం వారికిష్టం లేకపోయింది. శాశ్వతంగ శివ సన్నిధానంలోనే వుండి పోవాలను కున్నారు. జననీ జనకుల అనుమతి తీసు కొని తపోదీక్ష వహించారు.

కొంతకాలానికి వారి తపసులు ఫలించినై. పరమేశ్వరుడు ముందుగ పర్వతునికి ప్రత్యక్షమై "వత్సా! పర్వతా! నీ భక్తికి సంతసించి వరమియ వచ్చాను. నీకేం కావాలనో కోరుకొ"మ్మన్నాడు. పర్వతుడు లేచి చేతులు ముకుళించుకుని "సాంబశివా! మాయ అనంతమయింది. కాలము వక్రమ యింది. ఆ రెంటిని జయించడం మానవమాత్రులకు సాధ్యమైన పనికాదు. నా జీవితంలోనేనెప్పుడూ యే పొరపాటూ చేయరాదని నా ధ్యేయం. నేనెప్పుడూ నీ సన్నిధాన మందుండుట కన్న నాకు కావాలసిన దింకొకటిలేదు. అది ప్రసాదించండి" అన్నాడు.

మహేశ్వరున కదనిపుడు జాలివేసింది. "అయ్యో! పిచ్చివాడా! ఇంత కాలం కష్టపడి తపసు చేసిందిందులకేనా! నీ విపుడు కోరింది మోక్షసాధన వరం. అలాకాకుండా ప్రకృతిలో సుఖసంతోషాల ననుభవింప దగిన వరం

గూడ యింకొకటి కోరుకొమ్మన్నాడు. పర్వతు డాలోచించుకొని" మహాదేవు లనుగ్రహించారు. మీతోబాటుగ సకల తీర్థములు నాయందుండేలా కనికరించండి అన్నాడు. శంకరుడు తిరిగి "ఇందులో కూడ జీవితానందం కనపడడం లేదు. పోనీ మూడవ వరమైన భోగలాలసప్రదంగ కోరుకొ" మ్మన్నాడు, పర్వతుడు మళ్ళీ "చంద్రశేఖరా! మిమ్ము సేవింపవచ్చే యాత్రికు లెవరైన గాని అల్లంతదూరాన నుండి నన్ను చూచినంతనే వారికి కైవల్యం సిద్ధించేలా వరమీయండి" అన్నాడు. గౌరీరమణు డానందించి "నీ వడిగిన మూడు వరాలూ నీకిచ్చా" నన్నాడు.

శైలంగా రూపొందిన పర్వతం మీద తరువాత కైలాసవాసుడు శ్రీశైలభ్రమరాంబా సమేత మల్లికార్జున స్వామిగ క్షేత్రపాలకుడై నివసించాడు. అక్కడెన్నో పుణ్యతీర్థాలుదయించినై. సంస్కృతాంధ్ర తమిళ కర్నాటక దేశముల వారంతా వేదకాలంనుండి ఆ శ్రీశైలానికి హద్దుగా నియమించుకుని ఆయా ప్రాంతీయులు శ్రీ శైల దిశను నిత్యానుష్ఠాన క్రమాల్లో చెప్పుకుంటున్న సాంప్రదాయ మిప్పటికిని మనవారిలో కనబడుతూంది.

ఆ పర్వతమునే యిప్పుడు శ్రీపర్వత మంటున్నారు.

నాడు శంకరుడిచ్చిన వరఫలితంగా శిలాదుని కొడుకైన పర్వతుని ముఖమైన శ్రీశైల శిఖరం చూచినవారికి శివసన్నిధానం సిద్ధిస్తుందని ప్రసిద్ధ వాక్యమేర్పడింది.

మహేశ్వరుడు నందీశ్వరునికుగూడా సాక్షాత్కరించి "నందీశ్వరా నీ తపసు నన్నానంద పరవశుని గావించింది. నీ వడిగిన వరమీయ వచ్చాను.

నీకేం కావలెనో కోరుకో"మన్నాడు. నందీశ్వరుడంతట మహాభాగ్యమంటూ లేచి వినయాంజలి సమర్పించిన తరువాత "వాసుదేవా! అస్థిరములు—పతన హేతువులైన ప్రపంచ సుఖములతో నాకు నిమిత్తములేదు. జీవితాంతం మీ సేవచేయడమే నా యభిమతం. అందుకు గాను నన్ను మీ వాహనంగా స్వీకరించి నన్నెల్లపుడూ మీ దారినే నడిపించడం నాకు కావాలి" అన్నాడు.

శివుడు చిరునవ్వి "నందీశ్వరా! నీవు నా వాహనంగా యుండడాని కంగీకరిస్తున్నాను. కాని నా సేవచేసిన ఫలితంగా నీకు స్వార్థమైన కోరిక కోరుకొనవయ్యా;" అనగా నందీశ్వరుడు చిత్తమని "మహాత్మా! నీవు నివసించియున్న క్షేత్రానికి నా పేరు వాడుక యందునట్లుగా వరమిమ్మ"న్నాడు. పరమేశ్వరుండంతట సంతసించి "వత్సా! నేను నీ సోదరుడైన పర్వతునిమీద శాశ్వతంగా నివసింపబోవుచున్నాను. నీవు నాకు వాహనమై నా చెంతనే యుందువు. అంతేగాక నీ వింకొక రూపాంతరము దాల్చి శ్రీశైలానికి నైరుతిగా నేబదిమైళ్ళ దూరంతో పర్వతమలై యుండుము. నీవును నంది మండలమను పేరున నాకు నివాసయోగ్య శివక్షేత్రముగా ప్రజాదరణ పొందగల"వనిచెప్పి యదృశ్యమయ్యాడు.

శ్రీశైలమున కేబదిమైళ్ళలో యీశాన్యమున నదిమండలం ప్రఖ్యాతి గాంచింది.

# పర్వతము - శ్రీ పర్వతము

శ్రీశైలమపుడు శ్రీ పర్వతమను పేరున పిలువబడుతూంది. ఇంకా శ్రీ గిరి, సిరిగిరి, దక్షిణకైలాసము, మల్లిపురము, మల్లికాపురనే పేరులను గూడా సంతరించుకుంది. అక్కడనున్న లింగానికి పర్వతలింగేశ్వర స్వామి యనే పేరు. కృతయుగంలో కశ్యపబ్రహ్మ కొడుకైన హిరణ్యకశిపుడీ శ్రీశైలంమీద తపసు చేశాడు. ఆయనకు బ్రహ్మ ప్రత్యక్షమై దేవతల చేతగాని, మానవుల చేతగాని, పశుపక్ష క్రిమి కీటకాదుల చేతగాని, నిప్పు నీరు చేతగాని, భూమ్యాకాశాల చేతగాని, గద, ఖడ్గం, బాణం, శూలంలాంటి ఆయుధాల చేతగాని, భూతల గగన భాగాలందుగాని, దివా రాత్రులందుగాని మరణంలేని వరాలనిచ్చాడు. హిరణ్యకశిపుడా మహోత్తమములైన వరముల బలంతో దానవ సామ్రాజ్యాన్ని పాలించాడు. మహా పవిత్రమైన లీలావతిని భార్యగా పొందాడు. పరమ భాగవతుడైన ప్రహ్లాదుని కుమారునిగా కన్నాడు, చివరకు శ్రీహరి వలన అక్షయ మోక్షం పొందగలిగాడు.

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు తండ్రిమాట మేరకు భార్యను తమ్ముని వెంటబెట్టుకుని దండకారణ్యంలో వనవాసం చేయవచ్చి నపుడీ క్షేత్రపాలక స్వామిని సందర్శించి పూజించాడు. మల్లికార్జునస్వామి కరుణ చేత రాముడు దక్షిణారణ్యమంతా పర్యటించి వాలిని చంపి సేతుబంధనం కావించి, లంకకుపోయి మహావీరులైన రావణాదులను సంహరించి దేవతల చేత మునులచేతను గౌరవాభినందనలు పొందాడు.

ద్వాపరయుగంలో రాజ్యం కోల్పోయిన పాండవు లిక్కడకు వచ్చి స్వామినారాధించిన బలంతో వారికి పరమాత్ముడైన శ్రీకృష్ణానుగ్రహం సిద్ధించింది. అంతేకాకుండా దుర్యోధనుని సొమ్ము తింటూ అతని యింట్లోనే యున్న భీష్మ ద్రోణ కృప విదురాదులు వారికి ప్రత్యక్షంగా పరోక్షంగా కూడా సాయంచేశారు. కష్టాలు గడచిన పాండవులు భారతయుద్ధంలో కౌరవులను చంపి కురుసామ్రాజ్యానికంతా చక్రవర్తులయ్యారు. ఆ నాడే మన దేశంలో బలరాముడు మొదలైన యాదవరాజులు గూడా రాజ్యపాలకులై కాలక్రమేపి వారి వంశము వారే పల్లవరాజులుగా చరిత్రకెక్కారు.

కలియుగంలో క్రీస్తుశకం ఐదవ శతాబ్దంనాడు త్రిలోచన పల్లవరాజు యీ శ్రీశైలానికి ఆగ్నేయ భాగాననున్న అడవులను గొట్టించి గ్రామాల నిర్మించి వ్యవసాయాది సౌకర్యాల నేర్పరచి బ్రాహ్మణుల కగ్రహారాల నిచ్చాడు. తరువాత మరికొంత కాలానికి కరికాళచోళుడు త్రిలోచన పల్లవుని జయించి రాజ్యమాక్రమించినందున నాడు శ్రీశైలము చోళరాజుల పాలిత మైనట్లు చరిత్రలు చెప్పుచున్నవి.

రమారమి క్రీ.శ. పదునాలుగు, పదునైదు శతాబ్దాలనాడీ శ్రీశైలమందున్న శివలింగాన్ని విష్ణుకుండిన రాజు లారాధించారు. శ్రీ పర్వతస్వామి పాదభక్తులమని చెప్పుకుంటూ శిలాశాసనాలు చెక్కించుకున్నారు. పర్వతస్వామిగా నాడు ప్రఖ్యాతిగాంచిన ప్రాచీన లింగమీనాడు వృద్ధ మల్లికార్జున స్వామిగా దర్శనమిస్తున్నాడు.

పూర్వకాలాన వసుమతి యనే యోగిని యుండేది. ఆమె శివదీక్షా పరురాలు. చిన్నతనంనుండి ఆమెకు భక్తిప్రపత్తులెక్కువ. భగవత్సేవలు తప్ప యితర ప్రపంచంవంక కన్నెత్తి చూడదు. శివసాక్షాత్కారం పొందాలనే తాపత్రయంతో ఘోరమైన తపసు చేసింది. పరమశివుడామెకు దర్శనమిచ్చి "సౌభాగ్యవతీ! నీవింత కఠోరమైన తపసు నేవరంకోరి చేశావో చెప్పు. ఇస్తా" నన్నాడు. వసుమతియు వామదేవుని పాదంబులకు ప్రణమిల్లి "తండ్రీ! నాకు ధనధాన్య వస్తువాహనాది సంపద లక్కరలేదు. జన్మరాహిత్య పదవి నొసంగుము. మరియు నేను తపం బొనరించి సిద్ధి పొందిన ఈ స్థలము మహా పవిత్రమై ముందుకాలమునందొక దివ్యక్షేత్ర మగునట్లనుగ్రహింపు"మని వేడుకుంది.

ఆ మాటలాలకించిన పార్వతీరమణుండు సంతృప్తాంతరంగుడై "అమ్మాయీ! నీ సంకల్పం తప్పక నెరవేరుతుంది. నేను నీకు మోక్ష ప్రదానమిచ్చిన యీ క్షేత్రమునందే శిలాదనందనుండు పర్వతాకారంబున స్థిరవాసముండబోవు చున్నాడు. నే నాతనియందు సర్వ తీర్థములతోడను, ఓషధుల తోడను, ప్రముఖ దేవతా గణములతోడను మల్లికార్జునుడనై వెలయబోవుచున్నాను. నేను వేంచేసియున్న కొండ శ్రీ పర్వతమను పేరున రాణింపనున్నది. ఇందు నీ కథయు పురాణేతిహాసముగా చరిత్రార్థము కాగల" దనిచెప్పి యంతర్ధానమొందాడు.

# భ్రమరాంబికా మల్లికార్జునులు

ఆరవ శతాబ్దంలో విష్ణకుండిన వంశీయుడు మూడవ మాధవవర్మ బలవంతుడు. అతని రాజ్య మీనాడు దక్షిణకోసల దాకా వ్యాపించింది. ఆయనకు "త్రిపుర సుందరీ ప్రియు"డనే బిరుద మున్నది. కళింగరాజు లాతనికి సామంతులై కప్పములు చెల్లించాలి. సోమవంశానికి చెందిన చంద్ర గుప్తుని జయించి వాని కుమార్తె చంద్రవతీదేవిని బలవంతంగా పెండ్లాడాడు— కాని ఆతనికామె వలన దాంపత్య బంధం లేకపోయింది.

ఆ కాలాన సోమవంశ ప్రభువులు ఉత్తరకళింగ రాజ్యాన్ని పాలించారు. వారికి త్రివర నగరం రాజధాని. త్రివరరాజ సోదరునిపేరు చంద్ర గుప్తుడు. చంద్రగుప్తుని కుమార్తె చంద్రవతీదేవి, ఆమె అభిమానవతి. తన తండ్రి నోడించి అధికార పూర్వకంగా తన్ను పెండ్లాడిన మాధవవర్మ తన పెనిమిటి అని చెప్పుకొన లేకపోయింది. అత్తవారింటికి పోనని నిరాకరించింది. తల్లిదండ్రుల వెంట శ్రీశైల ప్రాంతాన నున్న మల్లికాపురం చేరుకుంది. సంసారసుఖాలమీద విరక్తి పొందిన చంద్రవతీదేవి ప్రతిదినం పాతాళగంగలో స్నానంచేసి కలశంతో నీరెత్తుకపోయి శ్రీశైలంమీదున్న లింగాన్నభిషేకించి తెల్లమల్లెలతో పూజిస్తూ వచ్చింది. భక్తిపారవశ్యంతో శివనామగానం చేస్తుండేది. నాడామె చేసిన శివనామ గానామృతం వలన నెందరో మానవులు భక్తులుగా మారిపోయారు. ఆమె తపోత్రియురాలు కనుక తపశ్చర్యగూడ నవలంబించింది.

ఒకనాడు చంద్రవతీదేవి శివలింగానికి తన దినచర్య ననుసరించి పాతాళగంగా జలాభిషేకంచేసి తెల్లమల్లెలతో పూజించి దీప ధూప నైవేద్య తాంబూలాదులు సమర్పించి భక్తిశ్రద్ధలతో ప్రార్థించే సమయంతో స్వామి సాక్షాత్కరించి నందున పరవశించి పోయింది. "దేవా! నాకీ రాజభోగాలమీద భ్రాంతిలేదు—జీవితం మీదను కోరికలేదు. నాకు కావాలసినది మీ సంధాన మొక్కటియే, నన్ను మీ నామభాగమున జేర్చుమని నాపేరు శాశ్వతముగా నిలిచియుండేలా మన్నించితే చాలు"నన్నది.

కళంకములేని భక్తురాలు. కైవల్యాన్నపేక్షించిన వరము. కాదనలేక పోయిన కరకంఠు డానందించి "కల్యాణీ! నీవడిగిన వరమిచ్చాను. నిన్ను భార్యగా స్వీకరించానుకూడ. నీవు నాభక్తి తత్త్వమును భ్రమరకీటకన్యాయంబుగా ప్రజలలో ప్రచారమునకు దెచ్చిన కారణంబుగ నీవికమీద భ్రమరాంబా నామము ధరించి నా చెంతనే నివశింప గలవు. నీవు ప్రతిదినమునన్ను తెల్లమల్లెలతో పూజించితివి కనుక నేనికమీద మల్లికార్జున నామధారి నగుచున్నాను. అప్పుడు మనమిరువురము భ్రమరాంబా మల్లికార్జునుల మయ్యేద" మని చెప్పి యదృశ్యమయ్యాడు.

తరువాత కొలది దినములలోనే చంద్రవతి తండ్రిగారి పేరునందొక నగర నిర్మాణం చేయించింది. చంద్రగుప్త నివసించినందునను, చంద్రగుప్తునిపేర గట్టించిన దగుటచే నను నాడా నగరం చంద్రగుప్త పట్టణమను పేరున రాణించింది, ఆనాడు మహావైభవ మనుభవించిన చంద్రగుప్త నగర మీనాడు పతనావస్థ పాలయింది.

# మల్లికార్జునాలయ నిర్మాణము

ఒకనాడు మహారాజ వైభవము లనుభవించిన చంద్రగుప్త మహారాజు కాలగతి ననుసరించి పరరాజుల కోడిపోయి మల్లికాపురము చేరినందున లజ్జావదనుడై యిలువీడి బయట ప్రపంచాన్ని చూడలేక పోయాడు. చంద్రగుప్తునకు రాజ్యంపోయినా గుప్తద్రవ్యం కొంత లభించినందున వారికపుడు శివభక్తి మక్కుటమయింది. పూజలకు వ్రతాలకు ఉపవాసాలకు తరచుగ వారింట పాలవసర మయ్యాయి. పాలకై చంద్రవతీదేవి గోవును సంపాదించింది. గోవువెంట గోవువచ్చి కొలదిదినాల కొక గోగణ మయింది. ఆలకాపనిగా యొక యాదవుడు నియమింప బడ్డాడు.

మందలోని ఒకావు మాత్రము ఏనాడూ పాలు పితికేదికాదు. దాని పొదుగు నందొక్క పాలబొట్టయిన నుండునది కాదు. కారణమేమిటని చంద్రవతి కనుకవానిని గద్దించింది. ఈ రహస్యమేమిటో చూడాలననుకొనిన రాజసమారి ఆలకాపరికి తెలియకుండ వాని ననుసరించింది. పాలీయని ఆ యావు సరాసరి శ్రీశైలం మీదకు పోయి పొదుగులోని పాలన్నీ పర్వతస్వామి లింగంమీద జాలువార్చి రావడ మామె కన్నులార చూచి విస్తుపోయింది. ఆవు పొదుగులోని పాలన్నీ పిండినా లింగంచెంత పాలచెమ్మయినా కనరాకపోవడం చంద్రవతిని మరింత ఆశ్చర్య చకితురాలను గావించింది.

ఆమె చూచింది నమ్మలేని సత్యం.

ఇంటికి వచ్చిన రాకుమారి నాటిరేయి శయనించినాక "ఏంస్వామీ! నీకు కావలసిన వేవో నాతో చెప్పరాదా! నీ మాట కాదందునా! నేనే స్వయంగా పాలలో పంచదార కలిపి పైడిగిన్నెలోపోసి నీ కారగింపులుచేసి యుందునే? నీకు పాలు పాయసాలు నేను నాచేతులార సమర్పించుకో నగనా!" అని పరిపరాల వాపోయి కన్ను మూసింది. ఆమెకు సుఖనిద్ర పట్టింది. స్వప్న దర్శనమయింది. స్వప్నంలో సాక్షాత్కరించిన సదాశివుడు "ప్రియురాలా; శ్రీశైల మీద నాకాలయం నిర్మింపుము. నేనక్కడి మల్లి కార్జున లింగమునై వెలయ నున్నాడను.అనంతరమున నీవును భ్రమరాంబవై నా ప్రక్కకు వచ్చి నిలువందగిన సమయం గూడ సమీపము నందున్నదని చెప్పి మాయమయ్యాడు.



తెలవారింది నిద్రమేల్కాంచిన చంద్రవతీదేవి స్వప్నగత వృత్తాం తము నంతా తండ్రికి వివరించింది. కేవలం భక్తి విశ్వాసాలతో నినుగ్నుడైన చంద్రగుప్త మహారాజుయు సంతోషించి "మన కంతకన్న యీ జన్మ కిం కేమి కావలయు నమ్మా! అయనగారే ఆలయం కావాలనడం మనం నిరాక రించడమునా!" అని పనివారలను వెంటనే రావించాడు. చంద్రవతీదేవి కార్య భారం వహించి దేవాలయం నిర్మించింది. పరమేశ్వరడు నచట మల్లికార్జున స్వామి పేరున స్వయంభూ లింగమై ప్రకాశించాడు. అది ద్వాదశ జ్యోతి ర్లింగాలలో నొక్కటిగ ప్రసిద్ధికెక్కింది. అటు తరువాత చంద్రవతీదేవి భ్రమరీశక్తి ప్రభావం వలన భ్రమరాంబయై వెలిసింది. నాటినుండి నేటివరకు పర్వత లింగేశ్వర స్వామి మనకీనాడు వృద్ధమల్లికార్జునస్వామిగా నారాధ్యుడైనాడు.

# శ్రీశైల రాజ నగర చరిత్రము

రమారమి క్రీ. శ. పదునైదు శతాబ్దాలకు పూర్వ మిక్కడ రాజనగర ముండేడిది. దాని పేరు శ్రీశైల పట్టణము. అది చిన్నపల్లెకాదు—సామాన్య గ్రామమూకాదు, విజయనగర సామ్రాజ్యాధిపతులైన సాళువ అచ్యుత దేవరాయల వారి హయంలో నిది యొక ప్రముఖ నగరమై కడప నాగలమఱ్ఱు సిరివేరు శ్రీశైలరాజ్యాల స్థాయి నందుకుంది. శివాజీ గోపురానికి వాయువ్యమూలగ పతనావస్థ యందున్న యీనాటి కోటగోడలు, ఆలయములు, బావులు, చెఱువులు. కట్టడములు మొదలైన శిథిలావశేషములను చూచి మనమిది పూర్వమొకప్పుడు బ్రతికిచెడిన పట్టణమని చెప్ప వచ్చును.

నాటి పల్లవులు చోళులు కదంబుల శాసనాలలోను తమిళాంధ్ర గ్రంథాల లోను కైఫీతులలోను శ్రీశైల క్షేత్రము యొక్క పుట్టుపూర్వోత్తరాలున్నాయి యని మన చరిత్ర పరిశోధనాచార్య శ్రీకొడాలి లక్ష్మీనారాయణ చౌదరి గారు ఆధారసహితంగా చెబుతున్నారు. ఈనగరం క్రీ.శ. 1839 నాటికి బ్రిటీషు వారి హస్తగతమై తిరిగి 1947 వ సంవత్సరంలో స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంది.

అది పల్లవులు మొదట జైన మతస్థులు. సింహవిష్ణు కుమారుడైన ఒకటవ మహేంద్రవర్మన్ కూడ జైనపల్లవుడే. ఆయన క్రీ.శ. 600 నుండి 630 వరకు రాజ్యమేలాడు. కొండలు దొలిపించి గుహలు నిర్మించి జైనులకు నివాస యోగ్యాలను కూడ కల్పించాడు. "చైత్యకారి" అని వానికి బిరుద మున్నది.

అనేసమయంలో అప్పార్ సంబవార్ అనే శివయోగులిద్దరు ఘటికు లున్నారు. వారు పేరు చెందిన శివయోగులు. వారిధాటికి జైనులోడుపోయి నందున మహేంద్రవర్మ జైనమతాన్ని విడిచి శైవమతంలో చేరాడు "మత్తవిలాస ప్రహసన" మనే గ్రంధాన్ని రచించాడు. దానితో జైనమత ప్రాశస్త్యము తిరగబడిపోయి శైవమత ప్రాధాన్యము మూడుపూవు లారు పిందెలుగా వికసించింది.

## భ్రమరాంబాష్టకము - శివానందలహరి

క్రీ.శ. 750 ప్రాంతాన మహిష్మతీపురంలో విశ్వరూపాచార్యుడను విశ్వవర్మ బ్రాహ్మణ పండితుడున్నాడు. పేర్వమీమాంశ శాస్త్రంలో ఉద్దండ పండితుడు. పండిత లోకానికే వెలుగిచ్చిన వాడైనందున సాహితీవేత్త లంతా ఆయన సత్తకు తగ్గటుగా "మండన మిశ్రుడ" డని బిరుదు నిచ్చారు. ఆమండన మిశ్రుని భార్యపేరు సరసవాణి. సరసవాణి అంటెనే చక్కగ మాటాడునది అని అర్థం ఆమె చెప్పిన మాట కింక తిరుగులేదు. విద్యారంగంలో ఆమె పతినిమించినసతీమణి. అయినందున ఆమెను "ఉభయభారతి" అని పండిత ప్రకాండు లంతా ప్రశంసించారు.

ఒకనొక సమయంలో శంకరునకు మండన మిశ్రునితో పండిత వాదం చేయవలసి పని కలిగింది. ఆతర్కంలో గెలిచించెవరో, ఓడినదెవరో

నిర్ణయించడానికి సమర్ధుడైన యింకొక మూడవ పండితుడు లేకపోయాడు. వారిరువురు కూడ మధ్యవర్తినిగ సరసవాణినే యెన్నుకున్నారు. మండన మిశ్ర శంకరాచార్యులకు కొన్ని దినాలు పండితపోరాటం జరిగింది. చిట్ట చివరలో ఉభయభారతి పక్షపాతం లేకుండ శంకర విజయమునే ప్రకటించింది, మండనమిశ్రుడు తను చేసిన శపథం ప్రకారం సన్యాసం స్వీకరించి తనోడించిన వానికి శిష్యుడనని ఒప్పుకున్నాడు. తరువాత సురేశ్వరాచార్య నామంతో శృంగా పీఠాధిపతియై అద్వైత మత స్థాపనాచారు డయ్యాడు.

మండనమిశ్రుని జయించిన శంకరాచార్యుడు పరిమిత శిష్యవర్గంతో శ్రీశైలం మీదకుపోయి హాటకేశ్వరం చెంత కొంతకాలం తపసు చేశాడు, ఆసమయంలో శంకరుడు భ్రమరాంబ పరంగా వ్రాసిన భ్రమరాంబీష్టకము బహుళ ప్రచారమున నున్నది. శ్రీగిరి భ్రమరాంబికాయను మకుటంతో కూడిన యీ యష్టకము అన్నసమారాధనలు,యితర భోజన మధ్యకాలంలోను పరిపాటిగ చదువుతుంటున్నారు. అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణా భవానివై అని అన్నారు. ఈ శ్రీశైలభ్రమరాంబె కాశిలో అన్నపూర్ణాదేవిగా యవతరించింది. అన్నపూర్ణాదేవి దయతో ప్రపంచమంతటా కరవుకాటకాలు లేక ప్రజల కన్నపానాదులు సమృద్ధిగానుండా లని వారి సంకల్పం. మోక్ష మొసగెడి కనక దుర్గవు. శిక్ష జేతువు క్రూరజనుల అని కీర్తించారు. దుర్గా సురుడు మొదలైన దుష్టరాక్షసులను సంహరించి విజయవాడ యింద్రకీలాద్రి మీద కనకదుర్గవై మాకు మోక్షమీయ గలవనియు భక్తిని ప్రకటించారు. అటులనే అంగ వంగ కళింగ కొంకణ లాట మహారాంధ్ర శృంగేరి పీఠములందు వెలసిన తల్లివని భ్రమరాంబను స్తుతించారు.

శంకరాచార్యుల వారు మల్లికార్జునస్వామి పరంగ "శివానందలహరి" అనే శివమాహాత్మ్య గ్రంథాన్నికూడ ఆ సమయంలోనే రచించాడు. దానికి భ్రమరాంబాష్టక మంత బహుళ ప్రచారం లేకపోయినప్పటికి గౌరవస్థానమే లభించింది. శంకరాచార్య కృత శివానందలహరిని తెలుగుచేసేకలు చేసిన వారిలో మధురకవి మల్లాది లక్ష్మీపతి శాస్త్రిగారొకరు. దానిని గుంటూరు వాస్తవ్యులు ప్రముఖ సినీరంగస్థల నటులు శ్రీధూళిపాళ సీతారామశాస్త్రిగారు క్రీ.శ. 1983 వ సంవత్సరమున ముద్రణ చేయించారు.

## శంకరాచార్య స్వాములవారి ప్రభావము

ఆ కాలంలో కాపాలికులనే వర్గమొకటుంది. వారు వారి యిష్టదేవతల మీందు నరబలు లిచ్చేవారు. గొప్పతాప సేంద్రునిగాని, గొప్పరాజేంద్రుని గాని బలియిచ్చినట్లయితే యిష్టసిద్ధులు కలుగుతాయి యని ప్రగాఢ సమ్మకం బలికాబోయే వానిని నయాననో, భయాననో యొప్పించి అతని యంగీకారం పొంది బలియీయడం విధానం. ఆ సమయంలో బలికాబోయే వ్యక్తి కన్నీరు పెట్టరాదు.

శంకరాచార్య స్వాములవారు శ్రీశైలంమీద తపోదీక్ష వహించిన రోజులవి. గొప్పవారికి ప్రతిపక్షం వారి వలన ప్రమాదములు సంభవించే యవకాశా లుంటాయి కనుక వారికి అంగరక్షకు లుంటారు. శంకరాచార్యుల

వారి కపుడు పద్మపాదు డంగరక్షకుడుగ నియమింప బడ్డాడు. పద్మపాలుడు కూడ సామాన్యుడుకాడు. అంగరక్షకులుగ నుండు వారికి స్వాములవారికున్న శక్తి సామర్ధ్యాలు చాలకపోయినా గురువుగావారి తరువాత గురువుగారంత ప్రజ్ఞ కలవారై యుంటారు. పద్మపాదునికి ముఖ్యంగ నృసింహస్వామి ప్రసన్న మొకటున్నది.

స్వాముల వారానాడు పద్మాసనాసీనులై తపోదీక్ష వహించి యున్నారు. ఆయన ముఖంలో బ్రహ్మతేజం తాండవిస్తూంది. అదే సమయంలో కర్నాటక ప్రాంతానికి చెందిన కాపాలికు డక్కడకు వచ్చాడు. స్వాముల వారిని చూచినంతనే యీయననే నేను దేవత ముందు బలి యిచ్చి విజయం పొందాలనే దుర్బుద్ధి పుట్టింది. వెంటనే గురువుల వారికి నిష్ఠనుండి మేల్కొలిపి నేను తలపెట్టిన సంకల్పం ప్రకారం మిమ్ములను మాదేవికి బలియీయ దలంచాను. మీరు సకలధర్మములు తెలిసినవారు. నా కోరిక నిరాకరింపక సమ్మతించాలి" అన్నాడు.

శంకరాచార్యుల వారందులకు బదులుగ "సరే—నేనుగా నీకెటువంటి నంతరాయమూ చెప్పను. కాని నా శిష్యాదుల వలన నీకేదైన ప్రమాదం జరిగితే మటుకు నా బాధ్యతలేదు. ముందు వెనక లాలోచించుకుని నీ యిష్ట మొచ్చినట్లు చేయవచ్చు" నన్నాడు. ఆ మాటలలోని భావ మతనికి అర్ధం కాలేదు. తన కోరిక ఫలించిందను కున్నాడు. పదునైన కత్తి చేత పట్టుకుని "సరే నీధ్యానమంతా పూర్తిగావించుకో. మధ్యలో భంగం చేయగూడదు. తరువాతనే నాపని నేను ముగించుకుంటా" నని ప్రక్కనే కూర్చున్నాడు.

పద్మపాదు డప్పుడు శంకరుని సన్నిధికి దూరంగా వున్నాడు. అయినప్పటికిని తన యోగశక్తి గురుదేవుల వారికి విపత్తు రాబోతున్న విషయం తెలుసుకున్నాడు. వెంటనే నృసింహస్వామి స్తోత్రం చేశాడు. ఉగ్రనరసింహమూర్తి యిక్కడావిర్భవించి కాపాలిని కాస్త చీల్చివేశాడు. పద్మనాభుడు గురువుగారిని చేరుకునే లోపలనే యిక్కడ జరుగవలసిన పనంతా జరిగిపోయింది. శంకరున కెటువంటి అపకారమూ జరుగలేదు.

శంకచార్యులు తనముందు సాక్షాత్కరించిన నృసింహమూర్తిని స్తోత్రం చేశాడు. తరువాత శిష్యజన సమేతంగా అహోబిలముపోయి అచటి క్షేత్ర పాలకులయిన లక్ష్మీనరసింహమూర్తి నారాధించి వచ్చిన తరువాత శ్రీశైలమునుండి గోకర్ణమునకు పోయినట్లు తెలియుచున్నది. శ్రీ శంకర భగవత్పాదులవారు శ్రీశైలము నందున్నది క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దము నందనికూడ "చిద్విలాసీయ శంకర విజయము. ఆనందగిరి శంకర విజయము" లను గ్రంధము లాధారములుగా చరిత్రకారులు చెప్పుచున్నారు.

అహోబిలము ప్రఖ్యాత నృసింహస్వామి క్షేత్రము. ఇది దిగువ క్షేత్రము—ఎగువక్షేత్రములని రెండు భాగములుగ రూపొంది యున్నది కొండమీది నృసింహాలయమునకు సప్త ప్రాకారములని ప్రతీతి. రెండు క్షేత్రములును ప్రభావములు కలవి. అచటి ప్రాకారకుడ్యములమీద మలచ బడిన శిల్పము లతిమనోహరములు. క్రీ.శ. పదునేడవ శతాబ్దమునందు శ్రీమద్విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు. అటు తరువాత వారి మనుమరాలైన మాతా జగదీశ్వరి యీశ్వరమ్మగారును శిష్యజన సమేతంగా యీ అహోబిలమును దర్శించినట్లు చరిత్రలు చెప్పుచున్నవి.

# మల్లికార్జునస్వామి కావ్య ప్రపంచము

విన్నకోట పెద్దయకవి రచించిన "కావ్యాలంకార చూడామణిలో" భారతదేశమున శ్రీశైలము కాళేశ్వరము దాక్షారామములు మూడు ఎల్లలుగా నున్నవనియు, మూడు ప్రసిద్ధ శివక్షేత్రములందు మూడు లింగములున్నవనియు, తరువాత వాడైన అప్పకవియు తన అప్పకవీయ మను లాక్షణిక గ్రంథము నందును పై యంశమునే ఉదహరించినాడు. త్రిలింగ పదమె త్రైలింగమై తెలుంగు తెలుగు దేశములకు నామాంతరములను ధరించినది.

పాల్కురికి సోమనాథుం డను శివకవి శ్రీశైలము నందుండియే బసవ పురాణము పండితారాధ్య చరిత్రములను రెండు శైవగ్రంథముల రచించి నాడు. పండితారాధ్య చరిత్రమునందు శ్రీశైల మహాత్మ్యమును గురించియే ప్రత్యేకముగ పర్వత ప్రకరణము వ్రాయబడి మల్లికార్జునస్వామి ప్రభావమును వెల్లడించుచున్నది.

కవి సార్వభౌములు శ్రీనాథకవి రచించిన కాశీఖండమను కావ్య మందు అగస్త్యముని చేసిన దివ్యతీర్థ యాత్రా విధానమున శ్రీశైలక్షేత్ర మహత్త్యమునే విశేషముగా కొనియాడ బడయున్నది. శ్రీనాథకవి శ్రీశైలము నందుండియే శివరాత్రి మహత్త్యమను ప్రబంధమును రచించినాడు. శివరాత్రి మహాత్మ్యమును శివసన్నిధియం దవతరింపజేయుటయే శ్రేయోదాయకంబని శ్రీనాథ కవీంద్రులు తలంచి యుండవచ్చును.

చక్రపాణి రంగనాథకవి మొదట వైష్ణవాచార సంపన్నుడు. శివ దూషణ చేసినందున వానికి కంటిచూపు లేకుండ పోయింది. అది శివనిందా ఫలితమేనని తెలిసికొని క్షమాపణలు చెప్పుకొనిన తరువాత "నమశ్శివాయ శివభక్త దీపిక" లను గ్రంథములను రగడలో రచించారు. కృతుల రూప ములలో చేసిన శివస్తుతి ఫలితంగా యింతకుమున్నె కోల్పోయిన నేత్రదృష్టిని తిరిగి పొందగలిగాడు. ఈ రంగనాథకవి" శ్రీ గిరినాథ శతకమను నూరుపద్యముల గ్రంథమును గూడ రచించినట్లు చెప్పబడు చున్నది.

శైవపండిత త్రయములోని పండితారాధ్యకవి గీర్వాణమున "తస్మైనమః శ్రీగిరి వల్లభాయ" అను మకుటముతో వ్రాసిన "స్తుతి శాస్త్రిక పంచకము. పర్వత వర్ణనలు కూడా శ్రీశైల ప్రభావమునే చాటి చెప్పుచున్నవి.

నాగలేటి శేషనాథార్యుడు "శ్రీ పర్వత పురాణ" మనుపేరున శ్రీశైల మహాత్మ్యమును రచించి శ్రీశైల మల్లికార్జున స్వామికి అంకితం చేశాడు.

రావిపాటి త్రిపురాంతకుడు రచించిన "త్రిపురాంత కోదహరణము" శ్రీశైలమునకు చెందిన ద్వారములలోనిదైన త్రిపురాంతక దేవుని కీర్తించు చున్నది.

శ్రీగిరి యనునొక కవి "శ్రీగిరీశ" మకుటంతో శతకమును రచిం చాడు.

విజయవాడ వాస్తవ్యులు చోడవరపు రాఘవాచార్యులవారి ధర్మపత్ని చోడవరపు సత్యవతీదేవి కవయిత్రిగారు క్రీ.శ. 1978వ సంవత్సరమున "శ్రీ మల్లికార్జున శతకము"ను రచించి ప్రచురించారు. ఇదియు శ్రీగిరి మల్లికార్జున స్వామిని కీర్తించుచున్న నూటెనిమిది పద్యములతో గూడినది. పండిత జన ప్రశంసలందుచున్నది. ఇట్లే శ్రీశైలమును గురించియు, శివమహాత్మ్యములను గురించియు వ్రాసిన కవులకు—గ్రంథములకు లెక్కలేదు.

## బ్రహ్మనాయుడు సాధించిన విజయము

క్రీ.శ. పన్నెండవ శతాబ్దంలో జరిగింది కారెంపూడి నాపరాల నాగులేటి యొడ్డున పలనాటియుద్ధం. మొదటలో దొడ్డమనాయుడు గురిజాల రాజ్యం స్థాపించుకున్న అనుగురాజు దగ్గర మంత్రిగా వున్నాడు. అనుగురాజుగారి మైలమదేవి, మైలదేవేరిదేవి చందోలు ప్రభువుగారి కుమార్తె. అనుగురాజు ముగ్గురు భార్యలలో పట్టమహిషియైన మైలమదేవి కుమారుడు నలగామరాజు. నలగామరాజుకు సవతి తల్లి కుమారులు నరసింగరాజు మొదలైనవారు యింకొక సవతితల్లి కుమారులు పెదమలిదేవ, చినమలిదేవ రాజాదులు. రత్నాల పేరమ్మ నలగామరాజుగారి యేకైక కుమార్తె. ఆమెకు సోదర సంతానం లేదు. పేరమ్మను తన తల్లినగన్న తాత తల్లిపేరున తండ్రికి రే

ణంగా యీయబడింది పలనాటి రాజ్యం. నలగాముని రాజ్యం మైలమదేవికి పుట్టింటివారినుండి సంక్రమించిన స్త్రీధనం కావున దానికి రత్నాల పేరమ్మ వారనురాయి. పెనిమిటి అలరాజు. అలరాజు తండ్రి కొమ్మరాజు. ఇది రాజ కుటుంబమందలి ప్రధానవ్యక్తుల వివరాలు.

నలగామరాజు తండ్రి తదుపాత రాజ్యానికి వచ్చినపుడుదొడ్డనాయకుని కుమారులలో బ్రహ్మనాయుడు మంత్రి యయ్యాడు. బ్రహ్మనాయుడు మంచిమేధావి. ఆయనకు ప్రజలలో పలనాటి కృష్ణుడనే పేరుంది. బ్రహ్మ నాయుని హాయాంలో పంచములను దేవాలయ ప్రవేశావకాశం కల్పించాడు. నిజానికి పంచముల దేవాలయ ప్రవేశ సంస్కారం మంచిదేకాని, దాని చాటున దాగియుండి ప్రజలను పతనం చేస్తూన్న చాపకూటి సిద్ధాంతం మొద లైనవి మాత్రం కొందరికి నచ్చకపోగా కష్టంకూడా కల్పించినై.

నాయకురాలు నాగమ్మ రాజకీయంలో అందెవేసిన చేయి. ఆమె నివాసం దమ్మాలపాడు. దామిరెడ్డిగారి పెంపుడు కుమార్తె. బాలవితంతువు. ఆమె యిప్పుడు సర్వస్వమును త్యజించి శివారాధనలో విమగ్నురాలయింది. నరసింగరాజు మెల్లిగా నాగమ్మను అన్నగారి దగ్గర మంత్రిపదవిలో ప్రవేశ పెట్టాడు. నాగమ్మ పదవిలోనికి వచ్చిన వెంటనే పంచము దేవాలయ ప్రవేశా ధికారాన్ని నిరాకరించింది. అదిగాక నాగమ్మయెంత శివభక్తురాలో బ్రహ్మ నాయుడంత విష్ణుభక్తుడు. నాగమ్మ నిర్ణయానికే పలుకుబడి హెచ్చినందున బ్రహ్మనాయుడింక నలగాముని కొలువు నందుండ లేక మంత్రిపదవికి రాజీ నామా యిచ్చాడు.

అదిచూచిన రాజకుమారులు లోటిపాడైన పెదమలిదేవుడు లేచి రాజ భాగం పంచి యిమ్మన్నాడు. రాజ్యం పంచేదికాదు. ఆ అధికార మెవరి లేదంది నాగమ్మ. నాగమ్మ వాదమే న్యాయసమ్మతమని బల్లగుద్దాడునరసిం రాజు. ఇదంతా చూచిన నలగామరాజాలోచించాడు. కుటుంబ కలహంలేకుం సరిపెట్టుదామని తలంచి మలిదేవాదులను "మీరు క్రొత్తనగరం కట్టుకొనండి" అంటూ ద్రవ్య మిచ్చి పంపించాడు. బ్రహ్మనాయుని యాజమాన్యంలో మలిదేవాదులు మాచర్ల పట్టణం నిర్మించుకున్నారు.అక్కడ నూతనరాజ్యం ఏర్పడింది. మాచర్లలో నాడు వారు నిర్మించిన చెన్నకేశవలయము నేటికి ప్రసిద్ధిచెందింది. మాచర్లదొరల కిపుడా బ్రహ్మనాయుడు సచివుడేకాదు- గురుతుల్యుడు. ఇంకా చెప్పాలంటే ప్రత్యక్ష భగవానుడు.

క్రీ.శ. 1161 నుండి 1170 దాకా కల్యాణదుర్గమును వీరసోముడు పాలించాడు. శత్రురాజు లొకప్పుడు వానిమీద దాడిచేయవచ్చారు. శత్రువు నెదుర్కొనే సాహసం సోమునికి లేక పోయింది. కల్యాణసోముడు పలనాటి ప్రభువులకు ప్రాతచుట్టమైనందున మాచర్ల పాలకులను సాయం రమ్మని కోరాడు. మాచర్లరాజు పెదమలిదేవుడు వానిసోదరులు ముప్వురు. బంధువు లైన కొమ్మరాజులు సైన్యాధిపతి కన్నమదాసు మొదలైన మెలికలు తిరిగిన వీరభటులకు సర్వసైన్యములను సమకూర్చుకొనిన బ్రహ్మనాయుడు రణసహా యం చేయడానికి బలుదేరాడు.

సోమప్రభువులున్నకోటకరుదెంచుచున్న బ్రహ్మనాయుడు శ్రీశైల వెళ్ళిమల్లికార్జు నస్వామి నారాధించి నతరువాత కల్యాణసోమునికి తోడ్ప

యుద్ధంలో ఘనవిజయం సాధించాడు. ఆయన తిరిగి మాచర్లకు చేరు చాప్పుడు ఒకరేయి శ్రీశైలమును సందుండి భ్రమరాంబా సమేత మల్లికార్జున నాశ్రయించిన వారికి యుద్ధరంగము సందఖండ విజయసిద్ధి కలుగుందను దానికి యిదియొక నిదర్శనము.

# కాకతీయ ప్రభువులు

ఆంధ్ర సామ్రాజ్యం నెలకొల్పిన వారు కాకతీయ ప్రభువులు. వరంగల్ పట్టణంలో నేటికిని కాకతీయులు పాలించిన ఏడు ప్రాకారాల కోట శిథిలావస్థలో మనకు దర్శన మిస్తుంది. ఓరుగల్లునే ఏకశిలాపుర మనికూడ అందురు. ఓరుగల్లు కాలక్రమేపి జనవాక్యంలో వరంగల్లునే మారింది. ఒకటవ ప్రతాపరుద్ర చక్రవర్తి దక్షిణదేశ యాత్రలో శ్రీశైలాన్ని స్వాధీన పరుచుకున్నాడు. క్రీ.శ. 1162 నుండి శ్రీశైలం తెలుగురాజులు పరిపాలనలో వుండి పోయింది. ప్రతాపరుద్రుడు శ్రీశైలానికి చెందిన త్రిపురాంతకంలో శిలాశాసనం వేయించాడు. వారి గురువులైన విశ్వేశ్వరాచార్యుల వారర్పించిన కొన్ని శివాలయాలు, మఠాలు కూడకట్టించారు.

గణపతి రుద్రదేవుల వారి యేకైక కుమార్తె రాణి రుద్రమదేవి. ఆమె తెలుగురాణి అని పేరు గాంచి ఆంధ్రసామ్రాజ్యమును పాలించింది. ఆడదిగదా యని యెదిరించి వచ్చిన గరిడగోపాలుడు యాదవ మహాదేవుడు మురారి

హరిహరులు మొదలైనవారిని బుద్ధిచెప్పి వీరనారీమణిగా చరిత్రకెక్కింది. అడవిరాజు గారు రచించిన "గజదొంగగో నగన్నారెడ్డి చరిత్ర"లో వరంగల్ కోట వర్ణన కన్నులను కట్టినట్లుగా చిత్రించి చూపించారు. కాకతీయ రుద్రమ దేవి శ్రీశైలము నందొక కల్యాణ మండపం కట్టించింది.

రుద్రమ్మ తరువాత రాజ్యానికి వచ్చిన కాకతీయ చివర చక్రవర్తి రెండవ ప్రతాపరుద్రుడు "ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్" అని పిచ్చివానిగ పాటలు పాడిన మంత్రియు గంధరుడి చక్రవర్తి కాలము నాటె. వీరి యాస్థాన విద్వాంసులలోని వాడైన విద్యానాధునకు అగస్త్యమహాకవి యను పేరుండేది. విద్యానాధుడు రచించిన "ప్రతాపరుద్ర యశోభూషణ"మను గ్రంథమున ఆంధ్రసామ్రాజ్య వైభవమును వివరించు సందర్భమున శ్రీశైల ప్రాశస్త్యమును గురించి పేర్కొనినాడు.

రెండవ ప్రతాపరుద్రుడు స్వయముగా శ్రీశైలయాత్ర చేశాడు. ఆలయానికి ఉత్సవవిగ్రహాలను సమర్పించిన తరువాత తూర్పువైపు కనుమల ద్వారా కలిం బద్వేలును దాటి పయనించి ఆ ప్రాంతానికంతకును తన మంత్రియైన గొంకయను సామంతపాలకునిగా నియమించాడు. అటులనే రుద్రవరంలో మజిలీచేసి అడవిని గొట్టించి "దుప్పిపాడ" అను గ్రామమును నిర్మించి. దానికి సేనాపతిగ శ్రీనాధరాజును నియమించాడు, అప్పుడా యడవిని గొట్టి పురనిర్మాణం చేసినవారు ప్రతాపుని విబుకాంద్రలోని యిరికప్ప— కేవినాయకు లనువారు. కాలాంతరమున నదా దుప్పిపాడు మార్పుచెందింది. నాటి కొండరాజుల పాలనలోని దూపాడును పదునైదవ శతాబ్దంలో గజపతి రాజు గెలుచుకున్నారు.

ప్రతాపరుద్రుడు శ్రీశైలంలో వీరభద్ర దేవునకు ముఖమండపం కొట్టించినట్లును; గణమఠం నిర్మించి మరీ పోషణకై డెబ్బది గ్రామంబుల నగ్రహారములుగ యిచ్చినట్లును, కాళయుక్త నామసంవత్సర మాఘశుద్ధ విదియలున తన దేశంలో గూడ శ్రీశైలము నందు తులాభారము తూగినట్లు కూడ చరిత్ర పరిశోధకులైన కొడాలి లక్ష్మీనారాయణ చౌదరిగారు కందనవోలు తాలూకా వెలుగోడి కైఫీతు నాధారంగ చెప్పుచున్నారు.

## ప్రోలయ వేమారెడ్డి ప్రభువు

కలిమిలేములు కావలి కుండలు. సంపదలెల్లప్పుడు నొకేచోటు నుండవు. మానవులలో మంచి ఆలోచనలు కలవారు సిరికలిగిన రోజులలోనే దాన ధర్మాలుచేసి చరితార్థులవుతారు. అందుకనే పెద్దలు చేసిన ధర్మం చెడని దన్నారు. కాకతీయ ఆంధ్ర సామ్రాజ్య మస్తగించిన తరువాత రెడ్డిరాజులు బలవంతు లయ్యారు. వారిలో ప్రోలయ వేమారెడ్డి భూపాలుడు మొదటివాడని చెప్పొచ్చు. ఆయన రాజ్యం గుంటూరు మండలం కందుకూరు ప్రాంతం త్రిపురాంతకం శ్రీశైలం అహోబిలం వరకు వ్యాపించింది. శ్రీశైల మప్పుడు ప్రోలయ వేమారెడ్డి రాజ్యానికి దక్షిణపు సరిహద్దుగ నియమింప బడింది. నాటి రెడ్డిరాజులకు అద్దంకి రాజధాని.

పోలయవేమన పరాక్రమవంతుడే గాక దైవభక్తుడు, వితరణశీలి. వీరి గురుదేవులు గోడె రాయరంగ శ్రీశైల మల్లికార్జున స్వామిభక్తుడు. గురువుగారి ఆశీర్వచన బలంతోనే తానీ రాజ్యమంతా సంపాదించానని నమ్మకం. భక్తి వేమారెడ్డిలో చెదరక నున్నవని ఎఱ్ఱాప్రగ్గడ హరివంశంలో తెలిపియున్నాడు.

వేమారెడ్డి ధరారమణుండు శ్రీశైలంలో నీలగంగ యనబడు పాతాళ గంగకు మెట్లుకట్టించాడు. శ్రీశైలపర్వతమునకు సోపానములు నిర్మించాడు. పండిన నగరంలో నూటినిమిది శివాలయంబుల నెలకొల్పాడు. చెదలవాడలో రాఘవేంద్రస్వామికి శ్రీరామసింహాసన మేర్పరచాడుఅహోబలంలో భవనాశిన దికి మెట్లు నిర్మించాడు. ఆయనింకా పుణ్యస్థలాలలోని ధర్మశాలల పోషించి వారి శివకేశవ సమభావాన్ని చాటుకున్నాడు.

రెడ్డిరాజులను గురించిన పూర్వకథొకటుంది. మొదట వీరు గుంటూరు మండలానికి చెందిన తెనాలితాలూకా లోని చదలవాడ యందుండు దొంతి వారను యింటిపేరటి వారు. పూర్వీకులెవరో పొలము దున్నుచుండ వారికి భూమిలో నిక్షేపం దొరకినదట. నిక్షేపమును గురించి తక్కినవారు పేయు చున్న గొడవలు పడలేక వారక్కడ నుండిలేచి అనుమకొండకు చేరుకున్నారు. అటు తరువాత యేకారణముననో గాని దొంతి అల్లారెడ్డి అల్లారెడ్డి కొండపల్లి దగ్గర కవులూరు చేరుకున్నాడు. వారి కొకానొక సమయంబున వింధ్య పర్వతములనుండి వచ్చుచున్న వేమన అనుకోమటి యోగీంద్రుని వలన పరుసవేది లభించింది. పరుస వేదితో బంగారం తయారు చేయవచ్చును.

ఆయా కారణాలచే రెండి కుటుంబాలవారు మహా శ్రీమంతులై రాజ్యం సంపాదించుకున్నారు. ఆ వంశీయులు కోమటి మేమనపేరుతో నూరు సంవత్సరాలు రాజ్యపాలన చేశారు.

ప్రోలయవేమనరెడ్డి కుమారుడు అనపోతారెడ్డి క్రీ.శ. 1353 తరువాత రాజపాలనాధికారయ్యాడు. వారి రాజధానిని యీయనయే అద్దంకి నుండీ కొండవీటికి మార్చడం జరిగింది. అనవేమారెడ్డియు తండ్రిగారి వలెనే శ్రీశైలమున కొన్ని సోపానములను రూపొందించివారి దైవభక్తిని ప్రకటించుకున్నారు.

ఈ అనపోతారెడ్డి తరువాత అనవేమారెడ్డి రాజ్యపాలనకు వచ్చాడు. ఆయనకు "జగనొప్పగండ"యను బిరుద మున్నది. ఈ ప్రభువు దూపాడును గెల్చుకొనిన తరువాత క్రీ.శ. 1377వ సంవత్సరమున శ్రీశైలంలో వీరశిరోమండమును గట్టించాడు. మన్యమీపుర శాసనమునుబట్టి యీఅనవేమారెడ్డియు శ్రీశైలమున కొన్ని మెట్లు మరమ్మత్తుచేసినట్లు తెలియుచున్నది. అమరావతి దేవాలయమును బాగుచేయించాడు.

అనవేమారెడ్డి శ్రీశైలమును సైన్యమును నిలుపుకొని దండయాత్రలు సాగించాడు. "ఆతుకూ"రను గ్రామమును శ్రీశైలమల్లికార్జున స్వామి గారికి ధర్మరముగా సమర్పించాడు. అదే సమయంలో విశ్వనాధుడను శైవాచార గురువర్యులకు ఖాండవ కొలసను గ్రామము సమర్పించాడు. ఈ సైవాచార విశ్వనాధుడు శ్రీశైల పర్వతనివాసి-కౌశిక గోత్రము నందుదయించిన మహానీయుడు. బ్రహ్మచర్య దీక్షా పరతంత్రుడు. శ్రీశైల

నివాసియు శివభక్తుడును శాంతభిక్షావృత్తి యతీశ్వరుని సేవకుడునైన పోలి దేవయ్యగారి ప్రోత్సాహమున అనవేమి భూరమణుండీ గ్రామదానము చేసినట్లు తెలియుచున్నది. అయనకు ధర్మ వేముడనియు నామాంతర మున్నది.

దండయాత్రలలో అనవేమారెడ్డి 1361—62 సంవత్సరములందు రాజమండ్రి నిరవాద్య పురములు మొదలైన వానిని ధ్వంసంచేసి తనరాజ్యము నానారు ఉత్తరమున రాజమహేంద్రము దక్షిణమున కాంచీనగరము పడమర శ్రీశైలముల దాకను వ్యాపింపచేశాడు.

అనవేమా రెడ్డిగారి తండ్రి అనపోతారెడ్డి-అనపోతారెడ్డి గారి తండ్రి ప్రోలయ వేమనరెడ్డి. ఈ ముప్పురును శ్రీశైలమునందు, అహోబలము నందును సోపానములను గట్టించిన రెడ్డి ప్రభువులే. వీరితరువాత రెడ్డి రాజులలో నైదవవారైన పెదకోమటి వేమారెడ్డి ప్రభువులు వారి యాస్థాన విద్యాధికారి పదవి యందున్న శ్రీనాధకవిని వెంటబెట్టుకుని కాశీ రామేశ్వర యాత్రలు సేయుచు శ్రీశైలము పంచారామము సింహాచలములను గూడ దర్శించుట సంభవించింది.

## అనవేమారెడ్డి ప్రభువు

శృంగారనైషధ మనుపేరున దమయంతి నలచక్రవర్తుల చరిత్రము నతిమనోహర శృంగార కావ్యముగ రచించిన కవి శ్రీనాధుడు. ఈ మహా

కవి భాగవతం రచించిన బమ్మెర పోతనామాత్యుల వారికి సన్నిహిత బంధువనిగూడ చాలామందికి తెలియును. శ్రీనాథ కవికి కవిరాజ, కవి సార్వభౌమ బిరుదులు ఉన్నవి. ఆయన సంస్కృతము, ఆంధ్రము, కర్నాటక భాషలలో గొప్ప పండితుడై నందున శ్రీనాథ భట్టారకుడని కూడ అన్నారు. ఈ మహాకవికి విజయనగరాధీశ్వర సంగమ వంశీయుడగు రెండవ దేవరాయలు కనకాభిషేకం చేసి కవిసార్వభౌమ బిరుదము నిచ్చాడు. కొండవీటి రాజులలో పెదకోమటి భూపాలుని యాస్థాన విద్యాధికారిగ పొందిన సన్మానాలకు లెక్కలేదు. ఆయనటు కర్నాటక ప్రభువులకు యిటు కొండవీటిరాజుల దగ్గరగూడా గౌరవము సంపాదించుకున్న రెండావుల దూడ.

శ్రీనాథకవి శ్రీశైల యథా సందర్భమున శివరాత్రి మహత్యమును రచించాడు. ఒకనాటి సమావేశంతో శాంత భిక్షావృత్తి శ్రీనాథ కవిరాజుతో మీరు రచించిన శివరాత్రి మహాత్యమును పువ్వుల శాంతయ్యగారి కంకిత మీయవలసినదిగ కోరినట్లును, కవిగారు సమ్మతించి కృతిసమర్పణ గావించి నట్లును తెలియుచున్నది. పువ్వుల శాంతయ్యగారు శాంతభిక్షావృత్తిగారికి ప్రియశిష్యుడు. శివరాత్రి మహాత్యమందలి శ్రీశైలాభివర్ణనలో రససిద్ధి రసాయనసిద్ధి మూలికాశిద్ధి హేమకాసిద్ధి మొదలైన సిద్ధులకిది సిద్ధిక్షేత్రమని పేర్కొనియున్నాడు. నిజానికి శ్రీశైలం సిద్ధులకు నిలయమైనందునకే సిద్ధనాగార్జునాచార్యులవారికది సుప్రసిద్ధ నిలయమయింది.

సిద్ధనాగార్జునుడు రచించిన కక్షపుటము—నిత్యనాథుడు రచించిన "రసరత్నాకర" మను గ్రంథములను తాంత్రిక గ్రంథములంటారు. ఈ

గ్రంధములందు రసాయనిక విధానములు, అవిఫలించే పద్ధతులు, మానవుడు ఎక్కువకాలం జీవించడానికి చేయవలసిన సాధనలు వీర్యవృద్ధిని, జ్ఞాన వృద్ధిని కలిగించే రహస్యాలన్నింటినీ చక్కగా విపులీకరించి వ్రాయబడినై. అంతేగాక నేలమీదంటకుండ యే సాధనం లేకుండ గాలితో తేలి గగన యానం చేయగలిగిన సూత్రములుగూడ వానిలో చెప్పబడినై. వాని ననుభవము పొందినవారికి రామాయణంలో ఆంజనేయుడు నూరుయోజనాల వారిధిని దాటినమాటా; సుషేషణుడు ఓషధితో లక్ష్మణుని బ్రతికించిన మాట; మహాఋషులు యుగాల పర్యంతం జీవించినమాట, సనాతనారు పరసవేదితో యినుముకు బంగారంచేసిన మాటలందేదీ బూటకంకాదని తెలుస్తుంది.

శ్రీశైల క్షేత్రమందలి చెట్లు, మంపలు, జలములు చివరకు కొన్ని జాతిరాళ్ళుకూడా ప్రత్యేక గుణములు కలిగినవే జీవధాదులందు ఉపయోగకరములైన పాషాణాములు నిందు లభింపగలవు. శ్రీశైలమునందు కొన్ని కొన్ని ప్రదేశములందున్న మన్నుయు లోకకల్యాణ ప్రదమైనదని తెలిపియున్నారు. అదిగాక యెక్కడ యేయే రసఖండము లున్నవో, వాని నెట్లు సేకరింపవలయునో, ఎట్లుపయోగించుకొన వలయునో మొదలైన ప్రయోగములు గూడ చెప్పబడినవి. శ్రీగిరికి సంబంధించిన కొండలమీద అభ్రకము మణిశిల రాతి పువ్వులు తాళకము శిలాజిత్తు స్ఫటికము మొదలైన ఖనిజములు గొప్ప ప్రభావంగల వనస్పతులు నేటికిని లభించుచునే యున్నవి.

# రససిద్ధుల రత్నాకరము - శ్రీశైలము

విజయనగరం ప్రభువులు లలితకళా పోషకులేగాక దానధర్మ పరాయణులు-దైవభక్తి కలవారు. రెండవ హరిహరరాయల వారిభార్య వనవాసి నేలు కదంబరాజ కుమారి. ఆమె పేరు కదంబ విఠలాంబాదేవి. ఆమెయు దైవభక్తికల యుత్తమురాలు. విఠలాంబ స్వప్నము నందొకనాడు భ్రమరాంబా మల్లికార్జున స్వామి కనబడి తన క్షేత్రమందలి ప్రధానాలయము నుండి నీలగంగ యనబడు పాతాళగంగ వరకు మార్గమున సోపానముల నిర్మింపుమని యడిగెనట. మరు దినము నందామె యీ యుదంతం తన పెనిమిటికి చెప్పింది.

స్వామియే స్వయముగా చెప్పుటయు మనము కాదనుటయునా అని తలంచిన రెండవ హరిహర రాయలది పరమేశ్వరానలుగా తల ధరించి శ్రీశైల మల్లికార్జునాలయానికి ముఖమండప నిర్మాణము ఆ వెనువెంటనే దక్షిణ భాగమందలి మండపములు గూడా నిర్మాణము గావించినంత విఠలాంబారాణి యభిలాషను గూడా మన్నించి దేవాలయమునుండి పాతాళగంగవరకు సోపానముల తోడనే మార్గం రూపొందించాడు. ఈ మెట్లదారి పొడవు వేయి యడుగులుంటుంది. ఆ సమయంబున రాయలవారు ధర్మపత్నీ సమేతంబుగా సోదరిని వెంటబెట్టుకుని పరివారములతోగూడా క్షేత్రమునకు వచ్చి మెట్లకు సమీపమున విఠలేశ్వరస్వామిని ప్రతిష్టించి నట్లును తెలియుచున్నది. పాతాళగంగ మల్లికార్జునాలయ సోపానములకు కదంబ

విటలాంబా సోపానము అనియు అచటి లింగమునకు విటలేశ్వరస్వామి యనియు నామముచేర్పడినవి.

సౌరాష్ట్రము నేలు బసవదేవరాజ కుమారుడైన కామదేవరాజ కుమార్తె విఠలాంబ. ఆమె తల్లిపేరు పద్మావతీ. కులము కదంబవంశమైనందున ఆమెను కదంప విఠలాంబ అనడం జరిగింది. విజయనగరాధీశ్వరులలో మొదటి హరిహరరాయల వారి కుమారుడు బుక్కరాయలు వారి కుమారుడు రెండవ హరిహరాయ ధరణీరమణుడు.

విజయనగర సామ్రాజ్య పాలకులకు ప్రతినిధిగ చోళమండలము నేలిన గోపయదేవ మహారాజ కుమారుడు సాళువ తిరుమల దేవరాజు. ఆయన శ్రీశైలము నందొక ధ్వజస్తంభము నెలకొల్పాడు. స్వాములవారి క్షేత్రము నందు సాళువ వంశరాజులు కొందరు త్రవ్వించిన చెఱువు లున్నవి.

ఇమ్మడి దేవరాయల వారినే వీరప్రతాప ప్రౌఢరాయలనియునందురు. ఆయన శైవమతాభిమాని. అసాధారణ శివభక్తుడు. ఒకప్పుడీ వీరప్రతాప ప్రౌఢరాయలు వారి సహోదరితోకూడ శ్రీశైలం వచ్చి స్వాములవారిని సేవించుటయు జరిగింది. ప్రతిదినమును మల్లికార్జునస్వామికి ఒకపళ్లెం నైవేద్యం చెల్లించి ఐదుగురు జంగమదేవరకు ఉచితముగ భోజనము పెట్టుట కేర్పాటులు చేశాడు.

ప్రౌఢరాయల వారి కొలువు నందు ఉద్యోగము చేయుచున్న దేవరయ్య భక్త శ్రేష్ఠుడే కాక, రాజాంతఃపురమున పని చేయుచున్న యొక పరిచారికయు కూడ వేర్వేరుగ కొంతకొంత భూములను కొని వారి పేరుల

మీదుగ ప్రతిదినమును స్వామివారికొక పళ్లెం నైవేద్యం చెల్లించి ఐదుగురు జంగమదేవరకు ఉచిత భోజన సమారాధనంబు జేయుటకు నిర్ణయించి యిచ్చారు. అలాగుననే వీరప్రతాప ప్రౌఢదేవరాయల వారి పుత్రికయైన అమ్మవాజి అయపాండ్య పెరుమాల దేవుని భార్యయు నిత్యప్రతిదినము స్వామి కొక పళ్లెం నైవేద్యం చెల్లించి ఐదుగురు జంగమదేవరలకు ఉచితముగ భోజనములు పెట్టుటకు గాను కొంతభూమిని కొని యిచ్చింది.

"యథారాజా తథాప్రజా" అన్నారుగా పెద్దలు.

ఇవి యన్నియు శిలాశాసనాల మీద చెక్కబడి యున్నవి.

# వీరప్రతాప ప్రౌఢ దేవరాయలు

సాళువ పెదమల్లపరాజు శివభక్తుడు. శ్రీశైల భ్రమరాంబా సమేత మల్లికార్జునస్వామి వారికి శాశ్వతముగ నిత్యనైవేద్యము చెల్లుటకు గాను సిద్ధవటం యొద్ద కొంత మాగాణి భూమిని సమర్పించుతూ! ఆ భూమి పంట నీటికై గంగసముద్రమను సరసును గూడ నిర్మాణం చేయించాడు. శ్రీగిరిమీద నున్న సరసునకు సమీపమున నందున్న తోట— రెండు భవనాలను గూడ ప్రభువులు దేవాలయపు జాస్తిగ ధర్మం చేశాడు. అంతేకాకుండా బ్రాహ్మణులు, జంగమదేవరలు, సాధువుల కన్నపానాది సౌకర్యములను కల్గించుటకు గాను రెండు పాడవులను గూడ యిచ్చాడు. పెదమల్లపరాజావారు

సిద్ధేశ్వరస్వామికి ముఖమండపం నిర్మించి చుట్టు ప్రాకారాన్ని గట్టించికొన్ని యితర కట్టడాలను గూడ పునరుద్ధరింప జేశాడు.

ఏరికంటి కామరాజు శ్రీశైలమందు చండియున్న ప్రదేశమందలి వంశాలలో అన్నపూర్ణాదేవీ విగ్రహమును ప్రతిష్ట చేశాడు. వీరనరసింహ రాయలు యీ క్షేత్రమును దర్శించి స్వాములవారికి వైభవములు జరుగు నిమిత్తం గౌరవాదుల నిచ్చారు. మల్లికార్జునస్వామికి దేవాలయమున మహా శివరాత్రి ఉత్సవములు జరుపుటకు గాను వర్తకసంఘం వారు కొంత ద్రవ్యము ను ధర్మముగా నిచ్చినట్లు తెలియుచున్నది.

## సాళువ పెద మల్లపరాజు

లింగయ్య యనినంతనే లింగాయిత శైవుడని తెలియుచున్నది. అందును వీరశైవము మూర్తీభవించిన జంగమదేవర. సాక్షాత్పరమేశ్వరావతారము. "స్వస్తిశ్రీ భువనైక త్రిలక్ష గ్రామగోళక మహామలాస్య సామ్రాజ్య పట్టభద్ర శ్రీ మద్రాజ గురుచరణ సరసీరుహా భూషితమస్తకులు శ్రీ త్రిపురాంతక దేవ దివ్యశ్రీపాద పద్మారాధమలైన. శ్రీ పర్వతామల బసవగోళక మఠము శ్రీమంతు నిజగురు శాంత పూజ్య శివదేశిక"లని వీరికి వక్కాణము. వీరు మహా విద్వాంసులు–జ్ఞానసంపన్నులనియు పేరుప్రఖ్యాతు లున్నవారు–మల్లికార్జునాలయ ధర్మకర్త.

ఈ శాంత లింగయ్య ప్రజల కుపయోగమునకును నీటికాలువ త్రవ్వించాడు. ఆలయం చెంత మఠం గట్టించి బీదల కన్నదానం చేయించాడు. బ్రాహ్మణులకు వేదాధ్యయనములు సేయు నవకాశముల గల్పించాడు. అతిథి-అభ్యాగతుల నాదరించాడు. అడవులను గొట్టించి, జనపదముల నేర్పరచి, నివసించిన వారి కనేక సౌకర్యముల కలిగించాడు, మల్లికార్జునస్వామికి భోగములను నడించి మల్లికార్జునస్వామి కృపకు పాత్రుడయ్యాడు.

ఈ శాంత లింగయ్యగారి కుమారుడుకూడ దేవాలయమునకు ప్రాకారం నిర్మించి ఏనుగులు; గుఱ్ఱములు, పక్షులు, భటులు మొదలైన రకరకములైన బొమ్మకట్టు చేయించాడు. ముఖమండపం కప్పుమీద బంగారుతొడుగులు వేయించి శివపురాణానికి సంబంధించిన విగ్రహములను సుందరముగ తీర్మానముల చేయించాడు.

శాంత లింగయ్యకు బొందితో కైలాసం పోవలయునన్న భ్రాంతి పీడించింది. జైనులను చంపితే శంకరుడే స్వయంగ వచ్చి కైలాసానికి వెంటబెట్టుక పోతాడని నమ్మియున్నాడేమో శ్వేతాంబర జైనులను లెక్కలేనంత మందిని పాపం దలంచకుండా చంపించాడు. మతోన్మాదంతో శాంత లింగయ్య యింత ఘోరమైన పనిచేసిన వార్తవిని విజయనగరాధీశ్వరులైన శ్రీకృష్ణదేవరాయలు వారెంతగానో బాధ పడ్డారు; వీర శైవమూర్తి శాంతలింగయ్య దగ్గరకు పెదగోటి నాయకుడైన గని తిమ్మనాయుని పంపి జైనవధ చేయ వలదని మందలించాడు, కాని శాంతలింగయ్య ప్రభువులవారి సందేశమును పాటింపని కారణమున తిమ్మనాయుడతనిని చంపివేశాడు.

# శ్రీకృష్ణదేవరాయ మహీపాలుడు

పూర్వం ధారానగారాన్ని పాలించాడు భోజరాజు. ఆయన ముఖం చూచిన వారు కవిత్వం చెప్పేవారట. ఆయనసంస్కృతంలోమహాపండితుడు కవి కూడను. భోజరాజా స్థాన కవి సంస్కృత మహాకవి కాళిదాసు. కాళిదాసంటే భోజరాజుకెంత ప్రేమాభిమానాలో కొలచి చెప్పగలవాడంటూయింత వరకు పుట్టలేదు. రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం లాంటిమహోత్తమ సంస్కృత కావ్యాలు కాళిదాస విరచితములే. అటులనే క్రీ.శ. 1530 వరకు విజయనగరం పాలించిన శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దన కవీంద్రులు మొదలయిన వారిని పోషించి కవుల కగ్రహారాలు సన్మానాలిచ్చి ఆంధ్రభోజమహీపాల గౌరవ స్థానాన్నందుకున్నాడు- మనుచరిత్ర లాంటికావ్యాల నంకితం పొంది మృతంజీవి యయ్యాడు.

కృష్ణదేవరాయలు సాహితీప్రియుడేగాక నృత్యగాన కళాభిమానులను నాదరించిన మహనీయుడు. వారి భువన విజయములో అల్లసాని పెద్దనగారేగాక పింగళిసూరన, నంది తిమ్మన,ధూర్జటి;రామరాయభూషణుడు, మాదయగారి మల్లన, వికటకవి తెనాలి రామలింగయ్య, కందుకూరి రుద్ర కవులుగూడ వున్నారు. శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యదకొక గౌరవస్థానమున్నది. ఇక యుద్ధములతో సాటిలేని మేటి ధీరుడు.

దండయాత్రలు చేసి విజయ పరంపరల నందుకున్న కృష్ణదేవ రాయలు దేవేరులను వెంటబెట్టుకుని అమరావతికి పోయి అమరలింగేశ్వర స్వామికి ధర్మములు చేసినాక శ్రీశైలం దర్శించాడు. శ్రీముఖ నామ సంవత్సర వైశాఖ శుద్ధేకాదశి నాడు భ్రమరాంబామల్లికార్జున స్వామికి అవసరసైవేద్యం మహానైవేద్యాలకు గాను పారుమాంచాల, ఆత్మకూరులను గ్రామాలను సమర్పించాడు. శ్రీశైలనగరంలో రథంవీధి ఇరుప్రక్కలా మండపములను గట్టించి యిచ్చారు. స్వాములవారికి వజ్రహారం. జాతిపచ్చ కంకణం, బంగారుపళ్ళెరములనే గాక వేయిబంగారునాణెములను గూడ బహూకరించాడు.

విజయనగర ప్రభువులకు మతద్వేషం లేదు. రాయలవారు కంచి తిరుపతి సింహాచలం కాళహస్తి, అహోబిలం మొదలైన క్షేత్రాలలో భూదానాలు చేశారు. వీరశైవభిక్షావృత్తి మఠం స్థాపించాడు. శ్రీశైల రాజ్యానికి పాలములుగ వానియల్లుడగు చంద్రశేఖరయ్యను నియమించాడు.

చంద్రశేఖరయ్య గారు మల్లికార్జునాలయానికి ఎదురుగ ఒక మండపం నిర్మించి మండపంలో ప్రభువులైన శ్రీకృష్ణదేవరాయల వారి ప్రతిమను మామగారైన దేమర్రు ప్రతిమను గూడ నిలబెట్టారు. మండపంలో వేంచేసి యున్న స్వామివారి పూజారి కర్చులకు గాను తనరాజ్య మందలి శివపుర మను గ్రామమును దానం చేశాడు, మరియు బంగారు నందివిగ్రహమును. భృంగీశ్వర పీఠమును గూడ స్వామికి కైంకర్యం చేశాడు. మల్లికార్జునాలయపు టుత్తరపు దిక్కున దేమయ్య పేరుననొక విగ్రహమును నిలిపి దాని కభి

ముఖముగ బంగారుస్తంభమును నాటించాడు. క్రింద నాగులాటి గ్రామం చెంత వీరభద్రాలయము నిర్మించి అందులో దేమయ్య పేరున లింగప్రతిష్ఠ చేశాడు. బ్రాహ్మణులకు దేవసముద్రమను గ్రామము నగ్రహారమిచ్చాడు. చంద్రశేఖరయ్య గారిట్లు చేసిన దానధర్మములు, దేవతాకార్యములు, సమారాధనలనేకములు.

మల్లికార్జున స్వాములవారి నివేశాలయం మీద నిర్మింపబడిన విమానమునకు చంద్రశేఖరయ్య గారు బంగారుపూత వేయించినట్లును. కృష్ణదేవరాయల వారు బంగారు రేకుల నిర్మించుచు స్వామివారికి పరమాన్న నైవేద్యం కొరకుగాను పల్లవోలు గ్రామము నిచ్చినట్లు శాసనముల ద్వారా తెలియుచున్నది. ఆ సంవత్సరమున బంగారుపనులు పూర్తి గావించిన శిల్పాచార్యులు నందికుంట నాగాబత్తుని కుమారుడనియు. వేయించిన దాన భక్త శేఖరనాయని మనుమడు—తిప్పనాయని కుమారుడునైన మల్లనాయుడనియు గూడా నాటి రాతిపలకలపై వ్రాయబడినవి.

# ఛత్రపతి శివాజి గోపురము

క్రీ.శ. 1513వ సంవత్సరంలో గోల్కొండ సామ్రాజ్యం నెలకొల్పిన సుల్తాన్ కులీకుతుబ్‌షా 1543 దాకా రాజ్యపాలన చేశాడు. కులీ మూడవ కుమారుడు జమ్‌షీద్‌కులి రాజ్యకాంక్షతో అన్నలను చంపి

మంచలించినందున మసీదులో నవాజ్ చేయుచున్న తండ్రిని చంపించి 1543లో రాజై 1550 వరకు పాలించాడు. వాని సోదరులలో కడగొట్టు వాడైన యిబ్రహీం అన్న పురాగతాలకు భయపడి విజయనగరం పారిపోయి అళీయ రామరాజాశ్రయంలో యేడేండ్లున్నాడు. ఆ సందర్భమున యిబ్రహీం కులీ యిచటి కవులు పండితుల సాంగత్యంతో సంస్కృతాంధ్రములలో మహా పండితుడై ఉర్దూభాషలో గ్రంధమునుగూడా రచించాడు.

ఇబ్రహీంకులీ చక్రవర్తి 1550 నుండి 1580 వరకు గోల్కొండను పరిపాలించాడు. ఆ సమయంలో అద్దంకి గంగాధర కవిగారిచేత భారతము లోని తపతీ సంహారణోపాఖ్యానము నాంధ్రీకరణము చేయించి అంకితం పొందాడు 1558వ సంవత్సరమున నెల్లూరు మండలంలోని కందకూరు వాస్తవ్యులు కందుకూరి రుద్రకవిగారికి చింతలపాలెం అగ్రహారంతోబాటు జరుగుంచిల్లిక చెందిన మున్నూరెకరముల యీనాము భూమిని గూడ యిచ్చారు. ఇరవయ్యో శతాబ్దంలో గూడ కవిగారి వంశీయులాభూమి ననుభ వించుచున్నారు. హిందూ దేవాలయాలను పునరుద్ధరించుకొనుటకు. నిర్మించు కొనుటకుగూడా ఫర్మానాయిచ్చిన గోల్కొండ ప్రభువులు వీరైయుండ వచ్చును. హైద్రాబాద్‌నకు సమీపమునందున్న మంగళంపల్లిలోని మహి మ్మాయా దేవాలయమున కీ యిబ్రహీం ప్రభువు లెంతగానో సాహాయ్య మందించి నట్లును తెలియుచున్నది. హిందువులీ చక్రవర్తిని ఇభరాముడని పేరుబెట్టి రచించిన పద్యములెన్నో నేటికి నిదర్శనములై యున్నవి.

ఇబ్రహీం బాదుషా గారి కుమారుడు మొహమ్మద్‌కులి 1580 నుండి ముప్పదొక్క సంవత్సరం రాజ్యపాలన చేశాడు. ఆయన ప్రియురాలైన

భాగమతి పేరున 1587 వ సంవత్సరంలో భాగ్యనగరం నిర్మించారు. తరువాత భాగమతి హైదరను పేరు కలిగినందున భాగ్యనగరం హైదరాబాదయింది. సుల్తాన్ మొహమ్మద్‌కులి— సుల్తాన్ అబ్దుల్లాల తరువాత ఏడవ గోల్కొండ ప్రభువుగా పేరుగాంచిన అబ్దుల్ హాసన్‌తానీషా 1672 నుండి 1687 దాకా రాజ్యపాలన చేశాడు, తానీషాతో గోల్కొండ సామ్రాజ్యమంతరించింది.

తానీషాయొద్ద అక్కన్న మాదన్న అనువారు మంత్రులుగనున్నారు. వారిలో మాదన్న మహామేధావి. గోల్కొండ ప్రభువుకు ఢిల్లి ఔరంగజేబు ప్రబల విరోధి. ఔరంగజేబు చాల బలవంతుడు-క్రూరుడుగూడ ఛత్రపతి శివాజి యనిన ఔరంగజేబుకు ప్రక్కలో బల్లెం. కనుక శివాజితో మనకన్నివిధాలా నేస్తం మంచిదని మాదన్నమంత్రి తానీషాతో మాటిమాటికీ చెబుతూ వచ్చాడు. తానీషా వారికిగూడ అది నచ్చింది.

తానీషా అనుమతితో మాదన్న శివాజీ కాహ్వానం పంపాడు,మాదన్న గారిమీద సంపూర్ణ విశ్వాసాభిమానాలు గల శివాజిప్రభువు వెనువెంటనే ముప్పదివేల అశ్వదళం నలుబదివేల కాల్బలంతో రఘునాధ పంతేను వెంటబెట్టుకుని 1677వ సంవత్సరం మార్చినెలలో గోల్కొండకు వచ్చి చేరుకున్నాడు. శివాజికక్కడ ఘనస్వాగతం లభించింది. తిరిగి రాయగాట్‌కు ప్రయాణమైనపుడాయన శ్రీశైలం వచ్చి క్షేత్రమున కరమైలు దూరాననున్న యొక భవనంలో విడిదిచేసి మల్లికార్జునస్వామిని సేవించాడు. ఒకనాడాయన కెందులకు కలిగినదో తెలియదుకాని శ్రీశైల క్షేత్రమునందే

ప్రాణములను బాయు సంకల్పముదయించి వెనువెంటనే కరవాలమున మెడ వరకు కొనబోవు నంతలో ప్రక్కనున్న రఘునాథ్‌పంత్ వాని చేయి పట్టుకొని ప్రయత్నము భంగపరచినందున శివాజి యొక దీర్ఘ నిట్టూర్పు విడిచినాడట.

శివాజీ ప్రభువుల వారికి హైదరాబాద్‌లో చౌత్ పన్ను రూపంలో లభించిన లక్షలాది సువర్ణమయ ద్రవ్యము నంతయు నందే విడనాడి స్వస్థానం చేరుకున్నారు. ఆలయ పాలకులా సొమ్ముతో స్వామి నివేశాల యమున గోపురమును నిర్మించి దానికి శివాజి గోపురమని నామకరణం చేశారు. శ్రీశైలమునందిపుడు శివాజి పదిదినములు మాత్రమే యున్నట్లు తెలియుచున్నది. నాడాయన మజిలీ చేసిన గృహమిప్పుడు పతనావస్థ యందున్నది.

# ధవళేశ్వరపు మార్కండేయ ప్రభువు

ధవళేశ్వరపు మార్కండేయ ప్రభువు క్రీ.శ 1580 నుండి 1611 వరకు గోల్కొండ చక్రవర్తులలో నాల్గవవాడైన మొహమ్మద్ కులీకి సామంతపాలకుడుగా పెందోట పురమును పాలించినట్లు తెలియుచున్నది. పెందోట గుంటూరు మండలములోని నాగార్జునకొండకు తూర్పున యెనిమిది

మైళ్ళ దూరమున నున్నది. మార్కండేయ ప్రభువు భాషాభిమాని-కళా పోషకుడు. దాత. తురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి యను వారి మార్కండేయ ప్రభువుల వారి యాస్థానకవులు. ఈకవి సోదరులు తెనిగించిన స్కాందపురాణములోని నాగరఖండమునకు మార్కండేయ ప్రభువు కృతి పతియై జంటకవులను ఘనంగా సన్మానించారు.

మార్కండేయ ప్రభువుల వారికి ముగ్గురు భార్యలు. వారి కుమార్తె చంద్రశేఖారాంబ, బాలమందామెను ప్రకృత్యంబ అని అంటారు. ఆమెభర్త పోతులూరి గురుబ్రహ్మాచార్యులవారు. ఆయన నందరూ పరిపూర్ణయాచార్య స్వాముల వారని గౌరవించారు. ప్రకృతాంబా పరిపూర్ణయాచార్య స్వాములని వేదాంతపరంగా చెప్పబడిన యీ చంద్రశేఖారాంబా గురుబ్రహ్మాచార్య పుణ్య దంపతులే సింధువేద మనంబడు కాల జ్ఞానంబను గ్రంధమును రచించిన శ్రీమద్విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారికి కన్న తల్లిదండ్రులు.

దేశభక్త వోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు బహుప్రాచీన గ్రంధ పరిశోధనలుచేసి వీరబ్రహ్మంగారి జననీజనకులు చంద్రశేఖారాంబా గురు బ్రహ్మాచార్యుల వారని సహేతుకంగా నిర్ధారణ చేసియున్నారు. వీరిమామ గారైన తాడికొండ రాఘవాచార్యులవారు ప్రప్రథమముగ శ్రీవీరబ్రహ్మేంద్ర స్వాముల వారి చరిత్రమునకు గ్రంధరూపం కల్పించారు. తరువాత కంది మల్లియ పల్లెలోని బ్రహ్మంగారి మఠమునందున్న చాటు కొండ సుబ్బయ్య శ్రేష్ఠిగారు బ్రహ్మంగారి చరిత్ర వ్రాసిన వారయ్యారు. అటు తరువాత

సత్తెనపల్లి వాస్తవ్యులు నిరంతర వీరబ్రహ్మేంద్రస్వామి చరణకమలముల నాశ్రయించుకొనిన వారునైన జవంగుల నాగభూషణరావుగారు బ్రహ్మంగారి జీవిత చరిత్రమును వ్రాసి ప్రచారం చేయ కలిగారు.

శ్రీమద్విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర జగద్గురుదేవులవారికిమాహా మహాత్మైన మార్కండేయ ప్రభువులు శివభక్తి కలిగినవారు. సదాచార సంపన్నుడు. ప్రజాసౌకర్యములకై గ్రామాదులలో చెఱువులు బావులు త్రవ్వించాడు. మఠాలు సత్రాలు నిర్మించి నిరతాన్న దానం చేయించాడు. పండిత కవుల నాదరించాడు. స్వయముగ తీర్థయాత్రలు చేసి శ్రీశైలమునందు భ్రమరాంబా మల్లికార్జున స్వామిని దర్శించి, ఆరాధించి పదకొండు శివ లింగముల ప్రతిష్ఠచేసి పదకొండు నూతనాలయంబులను రూపొందించి నట్లును తెలుగు నాగర ఖండమున చెప్పబడు చున్నది.

# వాశిరెడ్డి వేంకటాద్రి నాయుడు

రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు చింతపల్లి గ్రామ జమీందార్. చింతపల్లి గుంటూరు మండలంలోనిది. నాయుడుగారికి యిద్దరు భార్యలు. కాని సంతానం కలుగలేదు. సంతానాభిలాషియైన నాయుడుగారు తన సచివులైన పొత్తూరి కాశీదాసుగారిని వెంటబెట్టుకుని పరివారంతో కుటుంబ సమేతంగా బయలుదేరి శ్రీరంగం కుంభకోణం పాపనాశనం జంబుకేశ్వరం

చిదంబరం కాంచి కాళాహస్తి తిరుపతి జగన్నాథం శ్రీశైలములందును పర్యటించినట్లు కొప్పరాజు సుబ్బరాయకవిగారి కాంచీ మహాత్మ్యమను గ్రంథమున చెప్పబడింది. పాపయారాధ్యుల వారును "సరసహృదయాను రంజన" మను గ్రంథమున నీ విషయనే తెలిపి యున్నాడు. నాయుడు గారి చివరదశ అమరావతిలో గడచిపోయింది.

నాయుడుగారిని గురించిన వింత వింత కథలెన్నో జనపదంబున వినబడుచున్నవి. అవి యన్నియు గ్రంథముల కెక్కలేదు. ఒకానొక సమయంబున నాయుడుగారి కమతగాండ్రు సేద్యమునకై భూమి దున్నుచున్నారు. వారికి దాహమైనది. ఆ కమతగాండ్రలోని యొక యాదవుడు కడవ చేతపుచ్చుకుని మంచినీరు వెతికికుంటూ కొండ సొరంగం లోనికి పోయాడు, ఆతండట్లు కొంత దూరము పోగా లోపలనొక విశాల ప్రతించం. మనోహరమైన వెలుతురు చక్కని నీటికొలను. దానికావలగ కొన్ని ఆసనము లమర్చియున్నవి. అన్నిటిమీద, అందరు, కూరుచున్నారు. కాని ఒకదానిమీద మాత్రమెవరూ లేరు. నీటికై పోయిన యాదవుడక్కడ గడ్డంక్రింద కట్టబెట్టుకుని నిలబడ్డాడు.

ఇక్కడభూమి దున్నుచున్న వారతనికై యెదురుచూచి రాత్రికి యిండ్లకుపోయారు. అతని నా కొండ సొరంగంలో నేదో చంపి యుంటుం దనుకున్నారు. అతని వారాతనికి అంత్యక్రియలు గూడ చేశారు. మరికొన్ని రోజుల కాతని మాటే మరచిపోయారు. అది జరిగి సంవత్సరమయింది.

కొండగుహలో ఆసనాలమీద కూర్చున్న మహామునులా యాదవుని చూచి "యెందుకు వచ్చావు?" అన్నారు, మంచినీరు కావల న్నాడాయన.

వారు సరేమురుకొని పొమ్మన్నారు. కడవనిండా మంచినీరు నింపుకున్న యాదవుడు "అయ్యా! ఆ పీఠంమీద యెవరుకూర్చుంటారు?" అని అడిగాడు. వారా తనిని చూచి "అక్కడకు రాజా వేంకటాద్రి నాయుడుగారు వచ్చి కూర్చుం టారు. ఆ స్థానమాయనగారికై నియమింపబడింది. అదిసరికాని నీవిక్కడికి వచ్చినట్లు, మేమీమాట నీకు చెప్పినట్లు నీవెప్పుడెవరితోను చెప్పరాదు. అలా చెప్పితే చెప్పుతుండగనే నీవు తల పగిలి చనిపోతా"వని యాజ్ఞా పించారు.

అతని కదంతా ఒకగంట సేపయినట్లు తోచింది. గబగబా నీటి కడవ తీసికొని పొలంలోనికి వచ్చాడు. మరునటి సంవత్సరం సేద్యం చేయుచున్న పనివారాతనిని చూచి భయభ్రాంతు లయ్యారు. ఏడాదిక్రితంగా చనిపోయాడను కొనిన వీడిపుడు రావడమేమను కున్నారు. అతను కొండలోయ లోపల చరిత్ర వారికి కొంత చెప్పినాక నేనిక చెప్పను. చెప్పితే చచ్చిపోతా" నన్నాడు! ఈ వార్త క్రమక్రమంగా వెంకటాద్రినాయుడుగారి దాకా పోయింది. అయన మనసున కొన్ని యాలోచనలు వచ్చినై.

నాయుడు గారంట యాదవుని రావించి "నీ వింతకు ముందే చనిపోయినావని మేమంతా అనుకున్నాం. నీ కుటుంబానికి నేను కావలసిన సొమ్మిస్తున్నాను. ఆ రహస్య మేమిటో చెప్ప"మన్నాడు. నాయుడు గారిచ్చిన సొమ్ము తీసుకొన్న యాదవుడు జరిగినదంతా చెప్పి ప్రాణాలు విడిచాడనే దొక జనపద మందున్న కథ.

ఒకానొక సమయంబున నాయుడుగారు చెంచువాండ్రను చంపించె ననియు. చెంచువాండ్రను చంపిన పాపమున వాని కన్నము దినబోవ

పురుగులట్లు కనుపించుచుండేడి దనియు, ఆ పాపమునుండి విముక్తి పొందుటకై బంగారు గోవును చేయించి గోగర్భమునుండి దూరెననియు నొక కథ చెప్పుదురు. ఏమైనను నాయోడుగారు శ్రీశైలము నందేమి చేయించినది తెలియదుకాని తీర్థయాత్రలు చేసినపుడు భ్రమరాంబా మల్లికార్జున స్వాముల వారి నారాధించినది మాత్రం తెలియుచున్నది.

## శ్రీశైలమును దర్శించిన మహనీయులు

అక్క మహాదేవి!—అక్క మహాదేవి తల్లిదండ్రులు. జననము, భార్యాదుల వివరము లేమియు తెలియవు. ఈమె నివాసము మాత్రము శ్రీశైలము నందొక అటవీకోట. బ్రహ్మచారిణి. దిగంబరి రససిద్ధివలన యింద్రియవాంఛల జయించిన యోగిని. బసవేశ్వరుని శిష్యురాలు. గురుదేవుల గారి వలెనే సంస్కరణ భావమున్న యీమె హరలయ్యయను పంచముని కుమారునకు మధువయ్యయను బ్రాహ్మణ కుమార్తెనిచ్చి వివాహము చేయించిన మహాశయ సంపన్నురాలు. కల్యాణనగర్ మందలి అనుభవ మండపము నందు జరుగు ధర్మచర్యలలో పాల్గొనుచుండువారు. విశ్వ మానవ సౌదరప్రేమ కల్గిన విదుషీమణి. నిరంతర మల్లికార్జునస్వామి సన్నిధానమే తన నివాసము చేసికొనిన పరమభాగవతోత్తమురాలు.

ఒకప్పుడామె అల్లమప్రభువును చూడబోప నాయన "నీయీ దిగంబర వేషమేమి" టని ప్రశ్నించెనట. అందులకామె ప్రత్యుత్తరముగ "ఇది నా నిమిత్తముకాదు. మానవులలో జ్ఞానోదయము కలిగించి నిష్కామత్వము నలవరచుకొనుట "వని చెప్పి యొప్పించింది. వేమనయోగి చందంబున నీమెయు తన స్వానుభవంబులను పద్యములలో చెప్పిన కవయిత్రి. "శ్రీమల్లికార్జున దేవు నాస్థాన మెవరికిని తెలియదుకద!" అనిన అక్కమహాదేవి నోటిమాట ప్రజలలో యీ నాటికిని నిలిచిపోయింది. ఈమె శ్రీమల్లికార్జు ననుదినము సేవించి తరించిన ధన్యురాలు.

అక్కమహాదేవి చరిత్రమును బాలసాయి రచించింది.

పొన్నలాపురం సిద్ధరామేశ్వరుడు!—ఈ రామేశ్వరుడు బాల శివ యోగి. ఈయన జపమాచరించిన చోటునకు "సిద్ధరామేశ్వర కొల" నిపేరు. కొండమీదాలయమునకు ఆగ్నేయముగ కొలది దూరము నందున్న గుహ యందును నీయన తపమీచేసినట్లు చెప్పుచున్నారు. సిద్ధరామేశ్వరుని కొలనుగూడ శ్రీశైలమందే వున్నది. కన్నడ భాషలో సిద్ధరామేశ్వరుడు దచించిన భక్తిరసతత్త్వములు బహుళ ప్రచారమునందున్నవి. శ్రీశైలమును దర్శించిన కదిరెమ్మవ్వ, నీలాంబిక, ముక్తాయక్క, గంగాంబిక, మొదలైన. మహిళలంతా ధర్మచర్చలలో పాల్గొనవారే.

అల్లమ ప్రభువు—అల్లమప్రభువు శైవభక్తుడు. కన్నడములో భక్తి తత్వములు రచించి వెల్లడించిన వేదాంతి, అక్కమహాదేవి యీయన చెంతకు వచ్చినట్లు చరిత్ర కలదు. శ్రీశైలము నందు తపమాచరించి మల్లికార్జున స్వామి దివ్యానుహమునకు పాత్రుడై ధన్యమూర్తి.

ఆదెయ్య శ్రీశైల నివాసియై ప్రతిదినము భ్రమరాంబా మల్లికార్జునస్వామి నారాధించుచు తపమాచరించిన మహానీయుడు.

హేమారెడ్డి మల్లమ్మ బాల్యము నుండియు దైవభక్తి కలిగిన సదాచార సంపన్నురాలు. బాల్యమునందే వివాహం జరిగింది. హేమారెడ్డిగారి కుమారుడు పరమారెడ్డి గౌరీమెకు భర్త. అత్తవారింట కాపురము సేయు దినములలో కుటుంబ కలహములు పెరిగినై. కుటుంబంలో కలత లేర్పడి నప్పుడు కొందరన్నివిధముల భ్రష్టులయ్యేదరు. కొందరుత్తమ స్థానమున నందుకొనుచుందురు. మల్లమ్మకిగూడ సంసారంమీద విరక్తి కలిగింది. జీవితాన్ని పతనావస్థ దాకికి పోనీయక దైవభక్తికే అంకితం చేసింది. భ్రమరాంబా మల్లికార్జున సన్నిధానమునందే జీవితాంత మండదలంచి శ్రీశైలమునకు చేరి తపమాచరించి ధన్యురాలయింది.

సకలేశం ఆదిరాజయ్య. ఆదిరాజయ్యగారి తండ్రిపేరు మల్లరసు, బసవేశ్వరుని శిష్యుడై యుండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయం. బసవేశ్వరుని అనంతరమున యీయన శ్రీశైలంచేరి జపతపాది నియమంబుల పాటించుచు కొంతకాలంగడిపినాక అందే చనిపోయాడు. ఆయన కన్నడంలో రచించిన కృతులున్నవి.

కెరయపద్మరసు క్రీ.శ. 1170 ప్రాంతమున కెరయపద్మరసు అను శివభక్తుడు కన్నడమున "వీరశైవ దీక్షాబోధ" అను గ్రంధమును రచించాడు. పిడపర్తి బసవ కవిగారి తమ్ముని కుమారుడైన బసవకవి "వీరశైవ దీక్షా బోధ" యను ద్విపద గ్రంధం రచించాడు.

ఘంటావర్ణుడు శ్రీశైల క్షేత్రనివాసి. వీరికి ఘంటావర్ణ శివాచార్యు లను ప్రఖ్యాత నామము కలదు. సంస్కృత మహాభారతము రచించిన వ్యాసమునికీయన గురువని కొందరి యభిప్రాయం. కాలభేదము ననుసరించి యీ ఘంటావర్ణాడొక శివభక్తుడు మాత్రమే కాని వ్యాసమునికి గురువైన ఘంటావర్ణుడు కాడని చెప్పవీలగుచున్నది.

బలిదేవ రమనాధ్యుడు జంగమ బసవేశ్వరుని శిష్యుడు, భవశేశు నామయ్యయొద్ద యీవనీశుతి కొలువ నందుండువాడు, సిద్ధరామ శివయోగి బసవని సమకాలికుడు. రేణుకసిద్ధుడు పంచాచార్యులందొకడు. వెల్లగొండ మహాదేవయ్య మొదలైన వారెందరో శివభక్తులై తరించారు, వారు శ్రీశైల మును దర్శించి మల్లికార్జున స్వామి నారాధించినట్లు తెలియుచున్నది.

## పరదేశీయ పండితాభిప్రాయములు

శ్రీశైలమునకు సంబంధించిన యడవులలో సింహములు మొదలైన భయంకర మృగములున్నవి. క్రీ.శ. 1867.వ సంవత్సరమున పాశ్చాత్య దేశాల వేటగాండ్రు వచ్చి అరవదేడు పులులను తుపాకులతో కాల్చి చంపిన లెక్కతేలింది. ఈ యడవులలో యింకా కోతులు తోడేళ్ళు పులులు ఎలుగు బంట్లు గుంటనక్కలు మొదలైన జంతువులున్నవని పశ్చిమ దేశీయ చరిత్ర కారులు వారి పర్యటనలతో వివరించారు.

క్రీ.శ. 1955.వ సంవత్సరమున కెప్టన్ నెల్సన్ అను దేశయాత్రికుడు పరిశీలనా దృష్టితో యీ ప్రాంతములందు పర్యటించి తన గ్రంథంలో శ్రీశైలారణ్యములందు తేనె లక్క జిగురులు సీకాయ కరక్కాయ చంద్ర మోదుగ మొదలైనచెట్లు ఇప్పమోదుగ పువ్వులేగాక సంజీవకరణి పరుసవేది మొదలైన ఓషధులుకూడ కలవని స్పష్టంగా చెప్పారు. అడవిశనగ అనబడు దీర్ఘజీవికనే మన మూలికా శాస్త్రవేత్తలు సంజీవకరణియని పేర్కొన్నారు. పరుసవేదితో బంగారమును తయారు చేయవచ్చును.

కలన్ కాలన్ మెకంజీ యనునాతండు శ్రీశైలమును గురించిన స్వానుభవంబులను 1794వ సంవత్సరమునవ్యాసముగా వ్రాయగా అది 1798వ సంవత్సరమున బెంగాలునందు వెలువడుచున్న "ఆసియాటాంపరిశోధనలు" అను సంచికయందు ప్రకటింప బడింది. శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామి నివేశాలయ ప్రాకారము యొక్క నిడివి ఆరువందల అడుగులు—వెడల్పు ఐదువందల పదడుగులు. అనగ లోపలి వైశాల్యం (600+510=306000) మూడులక్షల ఆరువేల చదరపుఅడుగులని తెలియచున్నది. గోడలు మిగుల యెత్తయినవి. గోడల కుపయోగింపబడిన రాళ్ళను చాల పెద్దవి. గోడలమీద రూపకల్పము చేయబడిన శిల్పము లద్భుతములు. ఆ పనితనము నందు చిత్రితములైన ఏనుగులు గుఱ్ఱములు పులులు మొదలైనవి సజీవములు లట్లు భ్రమగొల్పుచున్నవి. రామాయణ భారత గాథలకు సంబంధించిన చిత్రములు నాటి సన్నివేశములను కన్నులకు కొట్టినట్లు చూపుచున్నవి. వస్త్రములు లేని స్త్రీ ప్రతిమలు సుందరాతి సుందరములై కనపట్టు చున్నవి.

1513వ సంవత్సరం నాటి శ్రీకృష్ణరాయలవారి శిలాశాసనము మరి కొన్ని మహోద్భుత శిల్పములు యుద్ధములను బోవుచున్న సైన్యము, రెండు చేతుల నాయుధంబుల ధరించిన భటులు పరుగులెత్తుచున్న దృశ్యములు, గగనయానము సేయుచున్న శిల్పములందు మనోహరములుగఏర్పబడినై. ఈ పనితనము పల్లవుల శిల్పమును బోలియున్నది. స్వామి మల్లికార్జునాలయము ముప్పది తొమ్మిదడుగులు యెత్తుగలది. ప్రస్తుతమున శిధిలావస్థ యందుండియు నాటి వైభవమును చెప్పకయె చెప్పుచున్న శ్రీశైల శిల్పకళా ప్రాభవము చరితార్థమని వ్రాయబడింది.

కలనల్ లాంచ్‌టన్ వారయిసీయి అనువారలు శ్రీశైలము 1563 అడుగులయెత్తు కలదనియు; ప్రజలచటి యడవిసంపద లనంబడు ఆకులు పూలు పండ్లు కలప తేనె కస్తూరి వెదురుబియ్యములను వ్యాపారము లందు పయోగించుకొను చుందురనియు కొందరీ అడవులకు వేటాడు పని మీదను, కొందరు వనమూలికాదులను సంపాదించుకొనుటకు పోవుచుందు"రని కూడ వ్రాశారు.

కెప్టెన్ న్యూబోల్డా అనునాతడు శ్రీశైలమును శ్రీశైలారణ్యములను, శ్రీశైలక్షేత్ర పరిసర ప్రదేశంబులను గాంచి ముగ్ధుడయ్యాడు. అలెగ్జాండర్‌రీ యనునాతడు శ్రీశైల దేవాలయమునకు చాలినంత మూలధనమున్నదని తన గ్రంథమున పేర్కొన్నాడు.

క్రీ.శ. 19వ శతాబ్దంలో డాక్టర్ బర్గెన్ అనునాతడు యీ శ్రీశైల క్షేత్రమును సావకాశంగ చూచి మల్లికార్జునాలయము మిగుల పురాతనము

నాటిదనియు, చరిత్రకారులచుని కలిగించు ప్రదేశమని చెప్పుచునే నేనీ శ్రీశైలక్షేత్రమును గురించి సొంతముగ తెలిసికొనలేక పోయానన్నాడు. అదేకాలమున దర్శింపవచ్చిన న్యూయల్ అనునాతడు తను వ్రాసిన "ఆంటి క్విటీస్" అను గ్రంథమున శ్రీ శైలము పురావస్తు శాస్త్రరీత్యా చూచినను, లేక చారిత్రక దృష్టితో చూచినను, పౌరాణిక దృష్టితో చూచినను గూడ మల్లికార్జునాలయము మిక్కిలి ప్రముఖమైనదని ప్రశంసించాడు.

# శ్రీశైలక్షేత్ర ప్రసిద్ధ దృశ్యములు

శ్రీశైలక్షేత్రం కర్నూలు మండలానికి నల్లమల కొండలలో యిరవై అయిదువందల అడుగుల యెత్తున ముప్పదిమైళ్ళ సమతల విస్తీర్ణ స్థలమున వెలసి యున్న ఈ భ్రమరాంబా మల్లికార్జునస్వామి క్షేత్రమున యాత్రికులు దర్శింప దగిన దృశ్యములు, సేవింప దగిన దేవతా మూర్తులు, స్నానమాడ దగిన పుణ్య తీర్థములు చేయదగిన పూజాది దానధర్మములు, వినదగిన యితిహాసములు పొందదగిన ఫలితార్థములు లెక్కకుమించి వున్నవి.

దేవతలు మునులు మానవులు యాత్రికుల కిది ముఖ్యస్థలము. ఇచటి దేవతామూర్తుల యొక్కయు తీర్థముల యొక్కయు క్షేత్రముల యొక్కయు ప్రభావము లనన్యసామాన్యములు. ఎనిమిది ద్వారములు, ఎనిమిదిశిఖరములు

తొమ్మిది పురములు. తొమ్మిది నందులు అసంఖ్యాక దేవతా గణముతో కళకళలాడుచున్న భూకైలాసం అనడానికి సందేహముండదు.

క్షేత్రపాలకుడైన మల్లికార్జునస్వామి దేవాలయం ఆరువందల అడుగుల పొడవైన ప్రాకారమునకు మధ్యనున్నది. ఏడుచుట్ల కోటయని పేరు కలిగిన యీ ప్రాకారము చాల పటిష్ఠమైనది. నాలుగు దిక్కులందు నాలుగు ప్రముఖ ద్వారములు—నాలుగు మూలల నాలుగు ఉపద్వారములున్న యీ ప్రాకారముమీద చిత్రవిచిత్రములైన రకరకముల శిల్పములు జీవకళలతో ఉట్టిపడుచున్నవి. అవి చూచిన వారికి కన్నుల పండగయేగాక హృదయానందము నినుమడింప జేయుచు భారత శిల్పవైభవమునకు నిదర్శనము లగుచున్నవి. అష్టభైరవు లెనిమిది ద్వారములందు దర్శనము లిచ్చుచున్నారు.

హంపి విజయనగరం ప్రభువులైన శ్రీకృష్ణదేవరాయలు తూర్పు ద్వారము మీది గోపురము నిర్మించారు. ఆయనగారే రథంవీథిల్లో రెండు ప్రక్కలందును మందిరముల గట్టించి యిచ్చారు. ఉత్తరపు ద్వారము మీది గోపురము ఛత్రపతి శివాజీ గోల్కొండ నుండి తిరిగి తనరాజధానికి పోవు సమయంబున నిటకువచ్చి స్వాములవారికి యిచ్చిన ద్రవ్యముతో కట్టబడి నందున దానిని శివాజి గోపురమంటున్నారు. దక్షిణ ద్వారము మీది గోపురం విజయవగరము నేలు రాజులే రెండవ హరహరరాయల వారిచే నిర్మాణ మయింది-యిది ప్రాచీనము, పశ్చిమ ద్వారముమీది గోపురము కట్టుబడి యందుండి యింకను పూర్ణాకృతిని పొందలేదు.

ప్రాకారమునకు లోపలి భాగమునందు మల్లికార్జునాలయము వెలసి వున్నది. ఆ ప్రముఖాలయానికి పడమరగ చంద్రమాంబాలయం, వీరభద్రాలయాలున్నవి, తూర్పు మండపాలలో రాజరాజేశ్వరాలయ మున్నది. ముఖద్వారము వైపునగాక మిగిలిన మూడువైపులందు ఆలయాన్నంటుకుని రంగ మండపములున్నవి. పడమటి ముఖమండపానికి ముందుగ నున్న వీరభద్రాలయ సమీపంలో బలిపీఠమున్నది. దాని ప్రక్కనున్న వసంత మండపాన్ని మల్లికార్జున కుండమంటారు. దాని ప్రక్కనున్న మండపాల వరుసలోనే షణ్ముఖస్వామి విగ్రహము చలువరాతితో మలచబడింది. దానికి చేరువగ ఆస్థానమండపం, అలంకార మండపాలున్నవి. దక్షిణంగవున్న అన్నపూర్ణ మండపాన్ని పాకశాల అంటారు.

ద్వాపరయుగంలో ద్రౌపదీ సహితంగా యిక్కడకు వచ్చిన పాండవులు భ్రమరాంబా మల్లికార్జున స్వామిని సేవించినపుడు వారిర్వురు నెల కొల్పిన మందిరములారున్నూ పశ్చిమ ప్రాకారమునకు సమీపము నందున్నవి. ఇంతకుముందు చెప్పుకున్న ఆస్థాన అలంకార మండపదేవాలయము నీపాండవులు నిర్మించిన వానిలోనివే.

నాడు చంద్రావతీదేవిచే నిర్మింపబడిన వృద్ధమల్లికార్జున లింగం మల్లికార్జునాలయానికి సమీపము నందున్నది. దానిప్రక్కన వేయిలింగములోకీ లింగాకృతి దాల్చిన సహస్రలింగ మండపమున్నది. ఉత్తరాభిముఖద్వారము నందు పంచనందుల నడుమనున్న పార్వతీ పరమేశ్వరులు దర్శనమిచ్చుచున్నారు. ఐదునందులు పార్వతీ పరమేశ్వరులుకూడ నొకే నల్లరాతియందు తీర్చబడిన శిల్పము తప్పకచూడ దగినది.

దక్షిణ ద్వారమున రంగమండపం- రంగమండపమునకు ముందు వీరశైవులానాడు నాలుకలు కత్తిరించమని మెడలకు గండకత్తెరలు వైచుకొనిన వీరమండపము లున్నవి. ఇచటనున్న పెద్దనంది విగ్రహమునే శనగల బసవన్న అంటారు. శనగల బసవన్న చుట్టూ అనేకములైనస్థంభం లున్నవి. ఆవలగ అక్కమహాదేవి మల్లమ్మల విగ్రహములు వెలసినై.

సహస్రలింగ దేవాలయమున పూజారులు జంగనుదేవరలు. ప్రతిదిన మిచ్చట నిర్ణీతకాలమున తాళ మృందగభేరీ ఘంటా నాదములు మ్రోగుచున్నవి. మల్లికార్జున దేవాలయ మందలి ధర్మాకర్తలు వీరశైవాచార్యులు. మల్లికార్జున స్వాములవారిని భక్తాదులు స్వయముగతాకి పూజించుకొనుటకన్ని కులములవారి కవకాశ మున్నది.

## భ్రమరాంబా దేవాలయము

ప్రముఖ విశాల ప్రాకారమునందే మల్లికార్జున స్వామికి వెనుక భాగమున నున్న మరియొక ప్రాకారమున మాతాభ్రమరాంబా దేవాలయ మున్నది. ఆలయ సోపానముల ననుసరించి యున్న నవలింగములు నవ బ్రహ్మలచే ప్రతిష్టలు చేయబడినై. దేవళ గర్భాలయమునకు ముఖ మండపం ఆ మండపానికి నలుప్రక్కలందలి స్థంభములపై నమరింప బడిన

పంచవాళీ లున్నవి. ఇచట శివాజి భవానిదేవినుండి ఖడ్గమును స్వీకరించు చున్న విగ్రహమున్నది. ప్రాకారపు గోడమీద రామాయణకథా సందర్భము లగు శిల్పములు చెక్కబడి యున్నవి. ప్రాకార ముఖద్వారము యొద్ద సిద్ధి దేవీ సమేతముగ విఘ్నేశ్వరుడు సుఖాసీనుడై యున్నాడు.

సిద్ధివినాయకుని తరువాత సింహమండపమనే అమ్మవార్యాలయము- దానికెడమ ప్రక్కగ త్రేతాయుగంబున సీతాదేవిచే ప్రతిష్ఠింప బడిన సీతా సహస్ర లింగము లున్నవి, రెండవ ప్రాకారం దాటిన తరువాత పడమరగ నొక పూదోటయు మిగిలిన మూడువైపు లందనేక లింగములు సాక్షాత్క రించుచున్నవి. తూర్పు మండపములో కాలభైరవ సరస్వతి లక్ష్మి కాళికా విగ్రహము లున్నవి. ఇంకను శ్రీశైలము నందున్న లింగములు విగ్రహ ములు మిక్కుటములై వున్నవి.

## శ్రీశైల మందలి జలాశయములు

పాతాళగంగ శ్రీశైలక్షేత్రమందలి పుణ్యజలాశయాలలో పాతాళ గంగ మిగుల ప్రభావం కలది. ఇందలి నీరు నలుపు రంగుగా నున్నందున దీనిని నీలగంగ అన్నారు. ప్రముఖాలయములు వేలసిన సమతలము నుండి క్రిందికి తొమ్మిది వందల మెట్లు దిగి రావలయును. ఈ సోపానములపంక్తి

పొడవు రెండుమైళ్ళున్నది. చంద్రగుప్త పట్టణ మిక్కడనే ప్రస్తుతము జీర్ణ దశయందున్నది. నీలగంగనుండి మల్లికార్జునాలయము వరమను భక్తాదులు నిర్మించిన మందిరములున్నవి. పాతాళగంగలో స్నానములు చేసిన యాత్రికులు పాత్రలతో నీరుగొనిపోయి మల్లికార్జున స్వామి నభిషేకించుట యిచట సంప్రదాయము. పాతాళగంగయనిన కృష్ణానదిలోనిదొక తీరం.

పడమటి కనుమలలో మహాబలేశ్వరము చెంత నుదయమై పయనింప సాగి తుంగభద్ర కేదవతి మణిప్రభాది నదులను కలుపుకుంటూ బ్రహ్మ విష్ణు రుద్రగిరులలో విశాలము తగ్గిముందుకుసాగి పోతూన్న పాతాళగంగలో స్నానమాడిన యెట్టి పాపులైనను పవిత్రులగుట నొక కథ తార్కాణముగ చెప్పుచున్నారు.

చాలరోజుల నాటిమాట. ఆమె పేరు కల్యాణవతి. కన్నవారిది కాంచీపురం. అవంతీపురము నందున్న వయసు మళ్ళిన బ్రాహ్మణునితో వివాహం జరిగింది. యవ్వన వతియైన ఆ యిల్లాలి కోరిక లేమియు తీరక చింతపడుతూంది. ఒకనాడామె స్నానం చేయటకై గంగానదికి పోవుచు మార్గ మధ్యమున నొక కడజాతి యువకుని చూచింది.ఆమె మనసు చలించింది. కలిగిన సంకల్పం పాపహేతువని తెలిసినా కామవాంఛను జయింపలేక పోయింది. ఆతనిని వశపరచుకుని పూపొదలచాటున రతిభోగములననుభవించిన తరువాత యథాప్రకారముగ నదిని సమీపించి స్నానమాడ బోయింది. అంతలో నదీమతల్లి మానవ కంఠంతో "కల్యాణీ! ఆగు! నీవు పతిద్రోహు రాలవు. వ్యభిచారిణివి. నన్నంటకము. సాహించితివేని శపింపగలనని పల్కింది.

ఆ మాటలు విన్న కల్యాణికి దరిదిక్కులు తోచలేదు. ఒకమారు బావురుమని యేడ్చింది." అమ్మా! గంగాభవానీ! నేను తప్పుచేయలేదనుట లేదు. నేను నడివయసుదానను. కట్టుకున్న మగనివలన కామవంఛ తీరలేదు. శారీర ధర్మము ప్రకృతి ధర్మము వయోధర్మములు నన్ను తప్పుదారిన పట్టిన మాట యధార్థం. నీవు నాస్థితిగతుల నాలోచింపకయే నాదోసము నెత్తిచూపిన నేనేమిచేయగలను! నీకేమని సమాధాన మీయగల"నని విల పించింది.

గంగాభవాని మనసు కరిగిపోయింది. కల్యాణి మాటలలో అబద్ధమేమీ లేదు. ఇపుడామెను మన్నించుట న్యాయమనుకుంది. "సరే అమ్మాయీ! జరిగిం దేదో జరిగిపోయింది. సందేహించకుండా వచ్చి స్నానంచేయి. నిన్ను పవిత్రంచేస్తా"అన్నది. కల్యాణి నదీమతల్లికి నమస్కరించి గంగలోస్నాన మాచరించి నంతనే ఆమె పాపంనుండి విముక్తి పొందింది. కాని ఆ పాప మంతా గంగాదేవి నావేశించి నందున నామె భూలోకంలోని పుణ్యతీర్థాల నన్నింటిని దర్శించుతూ శ్రీశైలానికి వచ్చింది. ఇచట ప్రవాహంలోపవిత్రు రాలయింది. గంగాదేవి మాలిన్యాన్ని భరించినందున పాతాళగంగా జలము పచ్చగా నున్నవని అందువలన నామెను నీలగంగ అంటారని యీ కథవలన తెలుస్తూంది.

ఏనుగుల కొలను;- భ్రమరాంబాలయానికి పశ్చిమముగ నున్నయీ కొలనులో దిగుటకు మెట్లమరింప బడియున్నవి. ఇదియు పవిత్రమైన జలా శయము, యాత్రికులకిదియు నుపయోగ పడుచున్నది.

భీముని కొలను- కొండమీద నుండి యీకోలను 652 అడుగులు నుందగకిన్నది. శ్రీశైలానికి రెండుక్రోసుల దూరంలో దోరణాల మార్గమునం దొకలోతుయం దున్నది. ఈకొలను నుండి సెలయేరొకటి ప్రవహించి కృష్ణానదిలో కలుస్తూంది. దీనికి సమీపము నందు భీమలింగేశ్వర లింగమున్నది. పూర్వము పాండవులలోని వాడగు భీముడిచటకు వచ్చెనట. అప్పుడాయనను దాహపీడన మధికమైనందున పరిసరము లందెందును త్రాగుటకునీరు లభింపని కారణమున కోపోద్రిక్తుడై గదతో నేలమీద కొట్టగనీ కొలను రూపొందినట్లు ప్రజావదంతి వినబడుచున్నది.

కొండవాగు- కొండ ప్రక్కగాపారుచున్నయేరు కొండవాగు. మల్లికార్జునాలయ ప్రకారమందలి వీరమండపమునందు మరణించిన వారికి ముక్తి లభించుచున్నదనునట్లే నమ్మక మీ వాగునబడి చనిపోయిన వారికి శివసాయుజ్యము సిద్ధింపగలదను పూర్తివిశ్వాసము గలవారెందరో వున్నారు. అట్టి నమ్మకమున్న వారిలో కుటుంబభారములన్ని తీర్చుకొనినవారు బుద్ధి పూర్వకముగ కైవల్యాపేక్షచే యీ కొండ వాగునబడిమరణించుచుందురు.

సిద్ధరామేశ్వరకొలను— నేడిది యొక గుహగ మనకు దర్శన మగుచున్నది. మల్లికార్జునాలయమునకు ఆగ్నేయమున సమీపము కందున్నది. పొన్నలాపురం రామేశ్వరుడను శివభక్తాగ్రణియచటనుండియే జపమాచరించినట్లు చరిత్ర చెప్పుచున్నది.

చంద్రకుండ తీర్థము— ఇది శివాజి గోపురమునకభిముఖంగా రెండు ఫర్లాంగుల దూరమున నున్నది. ఇదియు గుహగనే మనకు కనప్పట్టుచున్నది.

పాలధార—పంచధార- హాటకేశ్వరమునకరమైలుదూరముప తూర్పు భాగమున నున్నది. శంకరాచార్య భగవానుల వారి తపోభూమి. ఇచట నీరు రుచికరమైనది. ఈ తీర్థము ప్రవహించి కృష్ణానదిలోనే గలియుచున్నది.

ఉమమహేశ్వర తీర్థములు— రుద్రధార పంచధార అక్షయధార ఇంద్రధార దేవధారవిష్ణుధార భైరవధారసంధ్యాతీర్థం దేవహ్రదతీర్థంఇలాహ్రద తీర్థం కన్యాతీర్థం కాలహ్రద తీర్థములిచట ప్రధానములై వున్నవి.

అరంపురంలోని తీర్థములు- మల్లికార్జునతీర్థం నారదతీర్థం యోగితీర్థం తుంగభద్రాతీర్థములిందు ప్రశస్తిగాంచినవి.

సిద్ధవటక్షేత్రమందలి తీర్థములు— భృగుతీర్థము కపిల తీర్థము పాలక తీర్థం మత్స్యతీర్థం కుముద్వతీర్థములనునవి తొమ్మిదియిచట ప్రసిద్ధములు.

త్రిపురాంతకంలోని తీర్థములు-గుండిప్రభగంధవతి పుష్కరిణి పుష్ప వతి నేత్రపతి తామ్రచిత్ర జాహ్నవిలను యెనిమిది తీర్థములిచట ప్రఖ్యాతి గాంచినవి.

నరసింహబిలము—ఇది స్నానఘట్టమునకు నూరు గజముల దూరంలో నున్న గుహాయే నరసింహబిలమనబడుచున్నది. అచట నరసింహమూర్తి విగ్రహమున్నది.

# శ్రీశైలమందలి ప్రసిద్ధ క్షేత్రములు

హాటకేశ్వరము:—హాటకేశ్వరస్వామి వేంచేసియున్న స్థానం శ్రీశైలాని కాగ్నేయమూల నున్నది. ఇందు నివసించియున్న మౌనస్వామి జగద్గురు నాగేశ పండితారాధ్యుల వారి శిష్యుడు. వీర్మాత సాక్షాత్కారము పొందిన యోగసిద్ధులు. శ్రీశైల యాత్రికులలో చాలమంది యీ మహినీయుని పరిపాటిగ దర్శించుచుందురు.

ఏలేశ్వరము:— క్షేత్రపాలకుడు ఏలేశ్వరుని దేవేరి కాత్యాయని. ఇచటి క్షేత్రము ఏలేశ్వరస్వామి వారి పేరిటనే ప్రఖ్యాతిగాంచింది.

సోమశిల:—శ్రీశైలము కాగ్నేయభాగమున మొదటనున్న క్షేత్రము సోమశిల. స్కంధమహామునిచే ప్రతిష్ట చేయబడిన యీ సోమేశ్వరస్వామి కామాక్షి సహితంబుగ నిందు వెలసి యున్నాడు. పెన్నానదికి నల్లమల ఎఱ్ఱమల వెలిగొండలను కలియుచు కడప నెల్లూరు మండలములు కూడ చేరుచున్న కూడలి స్థానం.

పుష్పగిరి:—కడప మండల మందలి పెన్నానదీ తీరమున నున్నయిది బ్రహ్మ విష్ణుమహేశ్వరుల నిలయం. ద్వాపర యుగమున జనమేన జయ మహారాజు చేసిన ప్రతిష్ట లిచట ఆదిశేషుడు సంతాన మల్లేశ్వరుడు ఆంజనేయుడు పుష్పగిరీశుడు మల్లేశ్వరస్వాములేగాక లక్ష్మిదేవి మందిరము కూడ వున్నది. ఇది నైరుతి దిక్కున మొగదలయందే కలదు.

సంగమేశ్వరము:—సంగమ మంటె కలియుట. కృష్ణవేణీనది యుపనదులతోగూడి సముద్రమున కలియుచోట నున్న యీశ్వర క్షేత్రము సంగమేశ్వరము. ఇచటి దృశ్యము చూడ వేడుకగుచున్నది. ఇందలి భీమేశ్వరలింగము భీమునిచేతను; రుద్రలింగము కల్మషపాదుని చేతను; నరసింహ విగ్రహము వశిష్ఠుని చేతను, కపిలేశ్వరలింగము కపిలమహర్షి చేతను, ప్రతిష్టలు చేయబడినవి. ఇవిగాక శాండల్య తపోభూమియు, విశ్వామిత్ర ప్రతిమ లతి సుందరములుగా నున్నవి. ఇచటనే సప్తసోమేశ్వరులు వేంచేసి వున్నారు. శ్రీశైలమున కిది వాయువ్యమూల మొదటిలోనే వున్నది.

సూర్య సింహాసన పీఠము:—పీఠాధిపతులు శ్రీజగద్గురు నాగేశ పండితారాధ్య శివాచార్య భగవానులవారు. జంగము మల్లయ్యదేవర వారి సమాధి యిచటకు సమీపము నందున్నది.

కైలాస ద్వారము:—ఈ ద్వారము భీముని కొలనుకు సమీపముగ దారితల యందున్నది. ఇచట శివలింగము నందు లున్నవి. ఈ క్షేత్రసింహ ద్వారమునకు కైలాసద్వారమని పేరు.

లింగాల ఘట్టు:—ఇది పాతాళగంగకు మైలు దూరమున నున్నది. ఇచటి రాలెక్కువగ శివలింగము లట్లుండును. భక్తాదులు వానిని గైకొనుచుందురు.

కదళీవనము:—మల్లికార్జునాలయమునకు పదునారు మైళ్ళ దూరము నందున్న అరటి వనము. ప్రథమంబున నిది చంద్రగుప్తుని యుద్యాన వనము లందొక్కటి. తరువాత అక్కమహాదేవి తపోనిలయ మయింది. ఇవి

గాక హరిహర ఏకేశ్వర రససిద్ధేశ్వర రంగనాయక నీలకంఠేశ్వరు లకిది నివాసము. నాగార్జునాచార్య క్షేత్రమన వచ్చును నేటి నాగార్జున సాగర జల విస్తీర్ణమునందు మునిగిపోయిన యీ భాగమిపుడు మనకు దర్శన యోగ్యము గానున్నది.

## ప్రాకారమందలి ప్రముఖ ద్వారములు

తూర్పు ద్వారము:—త్రిపురాంతకము. ప్రముఖ సింహద్వారమిది. క్షేత్రపాలకుడు త్రిపురసుందరీ సమేత త్రిపురాంతకేశ్వరస్వామి. కుమారగిరి మీద త్రిపురాంతకాలయము, కదంబ వన మందలి కాసారమునకు నడుమ త్రిపురసుందరీ దేవ్యాలయములున్నవి. స్వామివారి దేవస్థానమునకు ఉత్తరమున పూలకొండ కలదు. పూర్వము తారకాసురునిచే సేవింపబడిన శివలింగము జాహ్నవీ తీర్థములున్నవి.

ఇచట చంద్రమౌళీశ్వర మందిరము, రామ మందిరము. ఇష్టకామేశ్వరీ మందిరము లున్నవి. మరియు కన్యాసిద్ధేశ్వరము, ఉత్తరేశ్వరము ధూర్జనటేశ్వరము, గౌరీశ్వరము, పృధువేశ్వరము, మాంతువేశ్వరము, సంగమేశ్వరము, సంగమేశ్వరము, పరశురామేశ్వరము, మణికేశ్వరము, ముక్తేశ్వరము భ్రమరేశ్వరము తులా సిద్ధేశ్వరము ధర్మేశ్వరము శ్రీకర్ణేశ్వరము

పునర్నవేశ్వరము మొదలైనవి గణనీయములు. దేవేంద్ర ప్రతిష్ఠయైన శివాలయముకూడ యీ సింహద్వారము చెంతనున్నది.

దక్షిణ ద్వారము:— సిద్ధవటము. క్షేత్రపాలకుడు కామాక్షీ సమేత సిద్ధవటేశ్వరస్వామి. ఈయనకే స్వర్ణవేదిక లింగమనియు నామాంతర మున్నది. పూర్వము నుండియు సిద్ధులకు నెలవైన యీ క్షేత్రము పినాకీ నదీ తీరమున వెలసినది. ఇచటి వృషభేశ్వర ప్రతిమ దక్షిణామూర్తి ప్రతిమ విఘ్నేశ్వర ప్రతిమ కామాక్షీ ప్రతిమ లత్యంత రమణీయములై వున్నవి. సిద్ధవటేశ్వరాలయమునకు దక్షిణముగ నున్న మఱ్ఱిచెట్టు మహిమ కలది. మిక్కిలి పురాతనమైనదికూడ.

ఇచట బాలసిద్ధేశ్వరము ,ఘంటాసిద్ధేశ్వరము, వకుళేశ్వరము, ఇష్ట సిద్ధేశ్వరము ప్రాణేశ్వరము కపిలేశ్వరడూ తామేశ్వరము మోక్షేశ్వరము శంకరేశ్వరము ఓంకారము పుష్పగిరి క్షేత్రములు గణనీయములు.

పశ్చిమద్వారము:— అలంపురము. క్షేత్రపాలకుడు జోగులాంబా సమేత బాలబ్రహ్మేశ్వరస్వామి ఈ క్షేత్రమునకే బాలబ్రహ్మేశ్వర క్షేత్రముపేరు. దీనికి పరశురామ క్షేత్రము—భాస్కరక్షేత్రమనియు నామాంతరములున్నవి. అష్టాదశ మహాశక్తులలో నొకరైన యీజోగులాంబ నిచట ఎల్లమ్మదేవతనడం వాడుక యందున్నది. జోగులాంబాలయ మందె రేణుకా దేవి విగ్రహమున్నది. రుద్రాక్షలతో నవతరించిన బాలబ్రహ్మేశ్వర లింగమునకెంత జలాభిషేక మొనరించినను నీటిబిందువు వెలుపలకు రాకపోవుట స్వామిప్రభావంబున కొక నిదర్శనము.

ఇచటి మణిభద్రేశ్వరము భోగేశ్వరము అమరేశ్వరము రామేశ్వరం తరుణేశ్వరం గణేశ్వరం యమునేశ్వరం పెద్దడిరామేశ్వరం సప్తమునీశ్వరం గుప్తమహేశ్వరం సిద్ధేశ్వరం ఇంద్రేశ్వరములు గణనీయములు. ఇవిగాక బాలబ్రహ్మ కుమారబ్రహ్మ పద్మబ్రహ్మ తారకబ్రహ్మ గరుడబ్రహ్మ స్వర్గబ్రహ్మ అర్కబ్రహ్మ విశ్వబ్రహ్మ వీరబ్రహ్మలను నవబ్రహ్మలకీ క్షేత్రమున నివేశమందిరములు ప్రకాశించుచున్నవి.

ఉత్తర ద్వారము;—ఉమామహేశ్వరం. క్షేత్రపాలకుడు ఉమాదేవీ సమేత మహేశ్వరస్వామి. అర్ధచంద్రాకారపు కొండమీద మహేశ్వరాలయ మున్నది. అమ్మవారి కొండమీద కోవెలలో ఉమాదేవి నాలుగు చేతులతో ప్రసన్నురాలై దర్శన మిచ్చుచున్నది. కొండకు సమీపమున దుందుభి సాగర మున్నది.

ఇచట మహేశ్వరము గణేశ్వరము ఏలేశ్వరము అఘ్నీశ్వరము జంబుకేశ్వరము అమరేశ్వరము గరుడేశ్వరము యమునేశ్వరము గోకర్ణమ హేశ్వరము నందీశ్వరము సూర్యేశ్వరము రుద్రకోటేశ్వరము అమరావతి పాపవినాశనము నవభైరవస్థానాలు నవదుర్గ స్థానాలు ఉమాశైలము హేమ శైలములను క్షేత్రములు గణనీయములు.

# అష్ట శిఖరములు-నవనందులు

1-త్రిపురాంతకమునందు అష్టవసువులకు నిలయమైన వైఢూర్య శిఖరమున్నది. 2. ఉమామహేశ్వరమునందు శివరుద్రగణములకు నిలయమైన మాణిక్య శిఖరమున్నది. 3. పుష్పగిరియందు రంభ ఊర్వశి మేనక ఘృతాచి తిలోత్తములను దేవతాస్త్రీలకు నిలయమైన ప్రవాళ శిఖరమున్నది. 4 అలంపురమందు భారతీబ్రహ్మలకు నిలయమైన బ్రహ్మశిఖరమున్నది. 5- సోమేశ్వరమందు ప్రమథగణ పరివేష్టిత కుమారస్వామికి నిలయమైన శౌప్యశిఖరమున్నది. 6- ఉమామహేశ్వరమందు భూతగణ సహిత పార్వతీ పారమేశ్వరులకు నిలయమైన హేమశిఖరమున్నది. 7-అహోబలమందు లక్ష్మీ శ్రీహరులకు నిలయమైన మరకత శిఖరమున్నది. 8- నందిమండలమందు నందీశ్వరునకు నిలయమైన వజ్రశిఖరములు ప్రసిద్ధములైవున్నవి.

నంద్యాలకు ఐదు క్రోసుల దూరమున నందిమండలమున్నది. శిలాదుని కుమారుడు నందుడు పరమనిష్ఠా గరిష్ఠుడై తపమొనరించి శంకరుని మెప్పించి స్వాములవారికి వాహనముగ పరిగ్రహింపబడిన మహా పవిత్ర స్థలము నందిమండల మనంబడుచున్నది. ఇచట పద్మనంది నాగనంది వినాయకనంది మహానంది శివనంది విష్ణునంది సూర్యనంది గరుడనంది సోమనందులను నవనందులు కొలువుదీరినై. ఇచట నందికేశ్వరుని మహానంది యనియంటారు.

శంకరు డొకనొక సమయంబున నందినారాధింపక నన్ను సేవించిన వారి పూజనే నంగీకరింపను. అట్లు చేసిన భక్తులను ఫలితము దక్కదు. నా భక్తులైన వారు ముందుగా నందీశ్వరుని సేవించితీరవలయునని చెప్పి యున్నాడు. కావుననే నందీశ్వరుడులేని శివాలయమెచటను కనరాదు. మహా ప్రళయములు సంభవించినను. యుగాంతములైనను, లోకములో హరించి పోయినప్పటికిని నందిమండలము మాత్రము శాశ్వతముగ నుండగలదను పురాణ ప్రసిద్ధ వాక్యము మనమందరము వినుచున్నదె. శ్రీశైల యాత్రికులీ నందిమండలములోని మహానందీశ్వరుని పూజింపకయే ముందుకు సాగి పోరు.

అశ్వమేధయాగం చేసినంత ఫలితమున్న వేయిజన్మలలో దేవతల నారాధించినంత పుణ్యము నీ నందిమండలమునకు భక్తిశ్రద్ధాభిమానాలతో నందిమండలమునకు ప్రదక్షిణ నమస్కారము లాచరించినవారు పొందగల రని పౌరాణికులు చెప్పుచున్నారు.

# పంచాచార్యుల పంచ మఠములు

పూర్వ సంప్రదాయములలో మఠములు కేవలం సన్యాసుల నిలయము లేగాక గొప్ప విద్యాలయముల స్థానములలోను పరిగణింపబడినై. జ్ఞాన సంపన్నులు పండితులు విద్యాదానములు సేయువారా మఠములలో అధ్యాపకు

ుగ పనిచేయువారు. ప్రతి కాలముఖి మఠమందును విద్యార్థులకు ఉచిత భోజనము, ఉచిత వసతిగృహము, ఉచితవైద్య సౌకర్యములు కలిగించిఉచిత విద్యాదానమును చేయుచుండెడివారు. ఆ మఠములలో తరచుగ శాస్త్రవాదములతో గూడిన విద్యాగోష్టి జరుగుచుండెడిది. బౌద్ధులు సంఘారామమునందును, జైనుల నివేశస్థానములందు నీ విద్యాదానము గౌరవింపబడెడిది.

ఘంటామఠము లేక ఘంటావర్ణ మఠము—శ్రీశైల మల్లికార్జునాలయం నుండి హైదరాబాద్ పోవు కొనిదారియందున్న పెక్కుమఠములలో యీ ఘంటా మఠము పేరుగాంచింది. ప్రథమము నందిచుట ఘంటావర్ణసిద్ధేశ్వరుడు తపమాచరించిన మఠం. ఆ మహానీయుడు దేవపూజాది కార్యములందు ఘంటను మ్రోగించిన సాంకేతికముతో శిష్యులను పిలుచుచున్నందుననుదానికి ఘంటామఠ మనుపేరు వచ్చినట్లు జనవాక్యం వినబడుతూంది. మఠాపరణమందు కొన్ని సమాధులు గుహలు నీటిదొనలున్నవి.

ఈ ఘంటా కర్ణేశ్వర మఠమున కుడిభాగ మందలి కోవెలలో శ్రీమద్గురాట్పోషితులూరి వీరబ్రహ్మేంద్ర జగద్గురు స్వాములవారి విగ్రహము నెలకొల్పబడివున్నది.

మఠములోని యెడమభాగ మందలి దేవళంబున ఘంటా కర్ణేశ్వర స్వామి ప్రతిమయు నిలపబడి యున్నది. ఘంటా కర్ణేశ్వరుడు చెవిలో ఘంటలు, కుడిచేతి యందు జపమాల-యెడమచేతియందు శివలింగములధరించి యున్నాడు. ఇచటనే ఘంటా మహాదేవత్యుయను మరియొక యతీంద్రుని ప్రతిమయు వెలిసినది. కాలనిర్ణయ వేత్తలు యీ ఘంటావర్ణుడు వ్యాసము

సీం(దుల వారి గురువులుకారని నిర్ణయించుచున్నను లింగాయతులు మా(త్రము సంస్కృతభారతము రచించిన వ్యాసభగవానుని గురుదేవులీఘంటాకర్ణేశ్వర స్వామియే ననిచెప్పుచున్నారు. వ్యాసభగవానులు శైలము ఖండము నీ శ్రీశైలము నందుండియే రచించినట్లు తెలియుచున్నది. యా(త్రికులు ఘంటా కర్ణేశ్వరుని గూడ పూజించుచున్నారు.

విభూతి మఠము—శ్రీకృష్ణదేవరాయల నాటి శాంతలింగ మిందు స్థాపించబడి యున్నది. ఈమఠములో కొన్ని మండపములున్నవి. కూడలిగ నున్న ఎత్తయిన (ప్రదేశము నందొక నంది గణపతి వి(గహము లున్నవి. వీనికి సమీపము నందున్న నల్లరాతి పలకమీద బీజాక్షర సంపుటమైన యం(త్రము కనవ్పట్టుచున్నది. పూర్వ మిచ్చట శాంతి మల్లయ్యయను వీరశైవ యోగి భక్తాదులకు విభూతినిచ్చి దీవించుచున్న కారణమున దీనికి విభూతి మఠమను పేరు వచ్చినదని కొందరభి(ప్రాయ పడుచున్నారు.

రు(ద్రాక్ష మఠము——మఠము నందలి శివలింగము పానుమట్టము మీద నిలిచియున్నది. ముందు వసారాయందు పుట్టలోని నాగేం(ద్రస్వామి (ప్రజల కప్పుడప్పుడు కనిపించు చుండునను (ప్రతీతియు కలదు. ఈ మఠమును నిర్మించిన మల్లిశంకరస్వామి యిచటనే నివాసముండి భక్తుల నాశీర్వదించి రు(ద్రాక్షల నిచ్చుచున్నందున దీనికీ పేరువచ్చినదని చెప్పుచున్నారు.

సారంగ మఠము:—ఈ సారంగ మఠమునకే సారంగధర మఠమను నింకొక పేరున్నది. సారంగేశ్వర యోగీం(ద్రుని నిర్మాణమైనందున సారంగేశ్వర మఠమనియు చెప్పవచ్చును. లోపలగుహాయం దొకప్పుడు , సారం

గేశ్వరుండను యోగి తపమాచరించి యుండ వచ్చునని కొడాలి లక్ష్మీనారాయణ చౌదరిగారభిప్రాయ పడుచున్నారు. చౌదరి గారభిప్రాయము సరియైనదో కాదన దగిన యితరాధారములును లేవు. ఈ మఠమునకు చుట్టు ప్రాకారము మున్నది. ఇచట ధ్వజ స్థంభము మీద క్రీ. శ. 1585నకు సరియైన పార్థివ నామ సంవత్సరం నాటి శాసనమున్నది.

ఒకానొక సమయంబున శ్రీశైలము మీద ఐదిండ్లవారైన నంది మఠము, భృంగి మఠము వీరభద్రమఠము మొదలైనటు వంటి ఐదు మఠ రూపాయముల యజమానులు-తదితరులు సమావేశమై యీ సారంగమఠాధిపత్యము పారంపర్యాధికారముతో ననుభవించెడి మహాచార్యులకు యెటువంటి పరివారము లుండరాదనితీర్మానించారు. అప్పుడీ మఠ మేలనాధికారియైన వానిని పేరు బాలసిద్ధయ్యగారు, పులి అన్నమనాయుని కుమారుడు సింగయ్య సమర్పించిన సానరాయి యీమఠమునందున్నది—శాసనమున్నది.

నందుల మఠము—నందిమఠము నందికేశ్వర మఠములని దీనినామాంతరములు. లోపల వేంచేసి యున్న నందీశ్వరుని వలన దీనిని నందుల మఠమన్నారు. ఒకప్పుడీ మఠముపతనావస్థ చెందినదనియు; నందికేశ్వరుడను పేరుగల యొకయోగి దానిని పునరుద్ధరణ చేసెననియు నందికేశ్వరుని వలన పునరుద్ధరింపబడిన దగుటచేతను కూడ యీమఠము నందుల మఠమని బడుచున్న దన్న జనవదంతి విన్పించుచున్నది. ఘంటాకర్ణేశ్వర మఠమున నది పశ్చిమ భాగమున నున్నది. వాపసులకు యోగ్యములైన సదావకాశము లిందధికముగ నున్నది.

ఇవిగాక శ్రీశైలమునందింకను సిద్ధులమఠము ప్రసిద్ధిమఠము మఠమఠము చంద్రకుండ మఠములును వీరభద్రమఠము భీమశంకార మఠము విశ్వామిత్ర మఠము గిరిజాశంకర మఠములుంకూడ గలవు. మరియు బల్లాహుమహారాజా వారు సతీ సమేతముగ శ్రీశైలం వచ్చినపుడు మల్లికార్జునాలయమునకు అమ్మవారాలయమునకును మధ్య బసవమఠము గణమఠము మొదలైన వానినినిర్మించినట్లు సోమనాధకవి విరచిత పండితారాధ్య చరిత్రలోని పర్వతప్రకరణమున తెలుపబడి యున్నది.

# శ్రీశైలక్షేత్ర ప్రదక్షిణము

లెక్కకందని శివలింగములు: చూడ సాధ్యపడని క్షేత్రములు: సేవింప వీలుపడ నంతమంది దేవతా మూర్తులు : స్నానమాడి పూర్తిచేయ లేనన్ని తీర్థములు : మహాకవులకైనను సమగ్రముగ వర్ణింప జాలని మాహాత్మ్యములతో నిండివున్న శ్రీశైలక్షేత్ర ప్రదక్షిణము ధన్యులకు తప్పసామానులకు లభింపనేరదు.

ప్రదక్షిణము చేయుటయందు కొన్ని విధములున్నవి. అందొకటి పద్మప్రదక్షిణమందురు. పద్మము రెమ్మలతో వర్తులాకారమున నుండును. భక్తులు ప్రదక్షిణము సేయునప్పుడు ప్రతిరేకు నంటుచు కేసరముల దాకుచు

మకరందమును గ్రోలుచు పుష్పగర్భములోనికి భ్రమరము చేరుచున్న విధమున శ్రీశైలమల్లికార్జునస్వామి సన్నిధానమునకు భక్తులు చేరు విధానము.

ఆలయద్వారాములలో యేద్వారము నందుండియైనను యాత్రికులు ప్రవేశింపవచ్చును. ప్రవేశించిన ద్వారమునకు సమీపమునందున్న తీర్థములలో స్నానములు సేయుచు దేవతామూర్తులను దర్శించి సేవించుచు అటులనే శ్రీశైలమును చేరవలయును. శ్రీశైలక్షేత్రపాలకులయిన భ్రమరాంబా మల్లికార్జునుల నారాధించిన యనంతరమున మరియొక ద్వారము యొద్దకుపోయి ఆయా స్థానంనందలి దేవతామూర్తులను పూజించిన తరువాత తిరిగి మూలవిరాట్‌ను దర్శించుచు నెనిమిది ద్వారములందు పర్యటించవలయును.

రెండవ విధానం రామప్రదక్షిణమందురు, యాత్రికులు వారు ప్రవేశించిన ద్వారంచెంతనున్న తీర్థములలో మునిగి అచట దేవతల నారాధించుకుని, అచటనుండి ప్రక్క ద్వారంచెంతకు పోయి అచటి తీర్థంలలో గ్రుంకులిడి దేవతలను సేవించుకుని మరల మూడవద్వారం నాల్గవద్వారం లట్లెనిమిది ద్వారముల చెంతను నిర్వర్తింప వలసిన విధులను నెరవేర్చుకొనిన అనంతరముననే ప్రధాన దైవములయిన భ్రమరాంబా మల్లికార్జునాలయను ప్రవేశించు విధానము.

ప్రధాన ద్వారంలలోనై దేసినినములు, ఉపద్వారంలలో మూడేసిదినములు భక్తులాయా దైవములను సేవింపవలయును. నియమ కాలంలో భక్తులు ప్రతిదినమును ఏకభుక్తం భూశయనం బ్రహ్మచర్యము భగవన్నామసంస్మరణము మానవ్రతంలను విధిగా పాటింప వలయును. సూర్యోదయమునకు పూర్వమే

మేల్కాంచి కాల కృత్యముల దీర్చుకుని స్నానాదిక్రియ లాచరించిన తరువాత సంధ్యాది వందనములు సేయ వలయును. పాతాళగంగ మొదలైన తీర్థంలలో చిత్తశుద్ధిగ స్నానాదులు నెరవేర్చవలయును. దేహ మాపాదమస్తకము విభూది నలముకొన వలయును. పెద్దలను, సాధువులను గురువులను గౌరవింప వలయును. కుంటి గ్రుడ్డి మొదలైన వికలాంగులను బీదసాదలను కనికరింప వలయును. శక్త్యనుసారముగ వివిధ దానములు సేయుచుండ వలయును. ఆయాక్షేత్ర పురాణములను మహాత్మ్యములను శ్రద్ధగా నాలకింప వలయును. శ్రీభమరాంబా మల్లికార్జునస్వామిని శోడషోపచారంలతో పూజించి, మనసు చేత–వాక్కుచేత–కాయములచేత పవిత్రముగ నమస్కరించి తీర్థ ప్రసాదంబులకు స్వీకరించుచుండ వలయును.

ఎల్లప్పుడు మనంబున శివపంచాక్షరీ మంత్రమును పఠించుచు సదాచారముస పరమేశ్వరు నారాధించిన వారికి యిహపరములు లభించుట నిశ్చయము. వారి జన్మాంతర సంచిత మహాపాపములైనను పటాపంచలమైపోవుట యందెట్టి యనుమానముడులేదు. శ్రీశైల శిఖరమును దర్శించినంతనే శివసాయుజ్యము లభించునని మహాత్ములు చెప్పియున్నారు.

# ఏనుగుల వీరాస్వామయ్యగారి స్వానుభవము

ఏనుగుల వీరాస్వామిగారు మద్రాసు సుప్రీంకోర్టులో "యింటర్ప్రేటర్"గా పనిచేసి యుద్యోగ విరమణ పొందినవారు. ఉత్తమాశయ సంప

న్నారు. సాహిత్యాభిమాని, దైవభక్తి కలవారు. సమాజంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించిన గౌరవనీయులువారు. క్రీ.శ. 1830వ సంవత్సరమున కుటుంబ సమేతముగ బయలుదేరి కాశీ శ్రీశైల యాత్రలు చేసి వచ్చినమహనీయులు. ప్రయాణ విధానములు, యాత్రాస్థల విశేషములు, క్షేత్రదృశ్యములు, ఆయా ప్రదేశములందలి సంప్రదాయములు, చెల్లించవలసిన రుసుములు మొదలైనవాని నన్నింటిని "ఏనుగుల వీరాస్వామిగారి కాశీయాత్ర" యను పేరున వ్రాసివున్నారు.

పూర్వకాలపు నాటి శ్రీశైలయాత్ర ప్రయాసకరమైన దని వినికిడి.

"చారిత్రక శ్రీశైల"మను పరిశీలనా గ్రంథమును వ్రాసిన శ్రీకొడాలి లక్ష్మీనారాయణ చౌదరిగారును ప్రాచీన శ్రీశైలయాత్రను గురించి చెప్పుపట్ల"ఏనుగుల వీరాస్వామయ్య" అను శీర్షికనిచ్చి వారికాశీయాత్రనుండి కావలసిన భాగమునిందు వెల్లడించియున్నారు.వీరాస్వామిగారు ది 18-5-1830వ తేదిన ప్రయాణం సాగించి మార్గమధ్యమున నెల జరుగగవారు ది. 16-6-1830 నాటికి శ్రీశైలము చేరినట్లు తెలియుచున్నది. నేటి యీ 1985 నాటికిది నూటేబదైదేండ్లనాటి యనుభవము కావున దీనిని పురాతన యాత్రా విధానమనియే భావింప దగివున్నది.

మనమిపుడు కొడాలి లక్ష్మీనారాయణగారి చారిత్రక శ్రీశైలం ద్వార ఏనుగుల వీరాస్వామిగారి స్వానుభవమును కొంత నెమరువేసుకొని తరువాత నేటి అధునాతన కాలప్రయాణ సౌకర్యములను తెలిసికొనుటకు ముందు సాగుట యుక్తమము.

శ్రీశైలమునకు తూర్పున ఆంధ్రప్రదేశ్, దక్షిణమున ద్రావిడదేశము, పడమర కర్నాటక దేశములు చుట్టుకొని వున్నందున మూడు దేశములనది యెల్లలుగా పరిగణింపబడుచున్నది. శ్రీశైల యొక ప్రాంతీయులకు ఒకభాషా రాష్ట్రీయులకు ఒక వర్గీయులకు పరిమిత మైనదికాదు. శ్రీశైలమునకున్న నాలుగు ద్వారముల నుండియు యాత్రికులు వచ్చుచు పోవుచుందురు.

# ప్రాచీనకాలమునాటి యాత్రా విధానము

16 జూన్ 1830 నాటికి వీరాస్వామిగారు సకుటుంబముగ పర్యటించుచు కాశి నుండి తిరిగివచ్చి శ్రీశైలమునకు పదిమైళ్ళ దూరమున నున్న యొకచోటును చేరుకున్నారు. ఆ నాడువారు శ్రీశైలమునంటివున్న పెద్దచెఱువును దాటిపోయి కొండనెక్కుటకు ప్రారంభించారు. క్రోసెడు దూరంవరకును బాట సమ తలంగాక యెగుడుదిగుడులుగ నున్నను సోపానముల మార్గమైనందున వారి కట్టి ప్రయాస మిక్కుటముగ లేకపోయింది. మార్గమున కిరుప్రక్కలందు అడవిచెట్లు—రాతినేలగల సమతలం రెండూ మైళ్ళున్నది.

తరువాత వారు భీముసికొలను సమీపించారు. ఆ కొలను సమతములన గాక అగాధమైన కొంతపల్లమునందున్నది. అచటను మెట్లమర్ప బడి వున్నవి. కొండ దొనలో ఒక వాగుపారుచున్నది. ఆదృశ్యములను చూచుచునే ఏడు మలుపులు తిరిగిన రెండువేల మెట్లమీదుగ నిలువున కొండ

లెక్కవలసివచ్చింది, అనుభవము లేని క్రొత్తవారికి కళ్ళు తిరుగును- బాట పొడవున మెట్లు, రెండువైపులా కొండలకు సంబంధించిన దృశ్యములు. రెండు క్రోసుల దూరం ముందు సాగిపోయిన తరువాత సమతల ప్రదేశమున్నది. అచటభూమి రాతిగొట్టుతో గూడి వున్నది. నడకకు సుఖప్రదమైనది కాదు ఐనను ప్రయాణము చేయక తప్పదు.

అక్కడనుండి నడవలేనివారిని పల్లకిలో మల్లికార్జునాలయం దాకా మోసికొని పోవు కూలీలున్నారు. వారిని బోయిలంటారు. ఈపల్లకీలను వారచట డోలీలందురు. డోలీలు మోయుటకుకూలీలు ఆరుగురు చొప్పున, ఎనమండుగురు చొప్పున ముటాలు ముటాలుగా నుందురు వారిలో ఉప్పాడబోయీలు కొందరు- ఆత్మకూరు బోయీలు కొందరున్నారు. తిరుపతిలోనుయీపద్ధతియున్నది తిరుపతి యెక్కదగినంత ప్రయాస యిచట లేదు. ఎనిమిది మంది ఉప్పాడ బోయీల డోలిని వీరాస్వామిగారు రెండుంముక్కాలడుగు వెడల్పున బంగాళా పాలక వలెనె చేయించి యెక్కారు. బోయీలు నాగులేటిని దాటిన పిమ్మట యికముందెంత ప్రయాస పడవలసి వచ్చునో ననుకున్నారు కాని వారనుకొని నంతశ్రమ లేకుండనే నిర్ణీత స్థలాన్ని చేరుకున్నారు.

ఆ మరునాడు 17వ తేది పగలు మూడుగంటలకు వీరాస్వామయ్యగారు కొండమీద మల్లికార్జునాలయ కల్యాణ మంటపంలో ప్రవేశించారు. అచట ముందుగుడి చుట్టు నొక గొప్ప నగరమున్నది, వేశ్యాంగనల గృహములు మూడుపండల అరువదున్నవి. అది అనాటి ముచ్చట. ఇప్పుడా పట్టణ మంతయు పాడుబడిపోయింది. ఉన్నట్టి భవనములు మనోహరములైన

గోడలు ప్రశస్తములైన బావులు నేడు శిథిలములై యున్నవి. అంతేగాక అసలే మారెడ్డిగారికి అదృష్టవశమున బంగారము పండినదని యిచటి జన వాడుక. ఆరెడ్డిగారే యీ మల్లికార్జునాలయం ముఖ్యమండపం నందులు విమానం ధ్వజస్థంభం బంగారుతొడుగులను చేయించారని చెప్పుకుంటున్నారు.

ప్రధాన దేవాలయానికి రెండు ప్రాకారాలు. వెలుపలి ప్రాకారపు గోడ మీద నలువైపులా శివలీలలకు చెందిన దృశ్యములను సుందర శిల్పములుగా చెక్కబడినై. ప్రాకారము ప్రతి కోటకొమ్మకు నొక్కొక్క శిల్పం తీర్చ బడింది. ఈ ప్రాకారము లోపలి రెండవ ప్రాకారము చాలవరకు దెబ్బతిని యున్నది. మంటపములు గూడ పతనావస్థ యందున్నవి. ఆలయము చాల పురాతనమని తెలియుచునే యున్నది.

మల్లికార్జున స్వాములవారికి నిత్య దీపధూప నైవేద్యాది వైభవములు క్రమబద్ధంగా జరుగుట లేదు. అచటి పూజారుల యిష్టానుసారముగా యెపుడో, యేలాగుననో, జరిగిపోవుచున్నవి. బ్రాహ్మణులు గాని యితరులు గాని స్వామికి అభిషేకములైనను, నైవేద్యములైనను యధేచ్ఛగా చేసికొన వచ్చును. అట్టివారి కెవరియాటంకములు నుండవు. మమ్మవారి దేవ్యాలయమున మాత్ర మర్చకుడున్నాడు. అర్చకులచ్చట మిరాశీదారులు. పూజారులు చాలమంది సంవత్సరమైనను యుద్యోగము సేయకుండగనే చనిపోవుచుండె రటగాని ప్రస్తుతము పూజారిగ నున్న యెనుబదేండ్ల వృద్ధ బ్రాహ్మణుడు మాత్రమిప్పటి కైదేండ్లనుండి యుద్యోగము చేయుచున్నారు. ఆయనగారి పేరు రాజశ్రీభట్టు. ఆయనయుకుటుంబములేని యొంటివాడట.

# శ్రీశైల క్షేత్ర విశేషములు

గర్భాలయములోని విగ్రహము నేలమీద జానెడెత్తున నున్నది. గుడి మీద విమానమునందలి యైదు శిఖరములు శిథిలములైనందున మధ్య శిఖరము మాత్రమే చూడనగుచున్నది. ఆత్మకూరు మార్గమున వచ్చివారికా శిఖరము దేవాలయమున ప్రవేశింపక పూర్వము కనపడదు. నెల్లూరు కంబం మార్గముల నుండి వచ్చువారికి మాత్రము ఆరుమైళ్ళ దూరము నందున్న శిఖరేశ్వరమను ఎత్తుప్రదేశమున నున్నపుడా శిఖర దర్శన మగుచున్నది. ఆగుడి దగ్గరనున్న చెంచువాండ్రు ఆత్మకూరువారును మల్లికార్జునాలయము నకు సమీపమందలి గుడిసెలలో నివసించుచున్నారు.

గర్భాలయపు గడపమీదా శ్రీచక్రయంత్రము స్థాపింపబడి యున్నది. ఆలయములో పదకొండ తీర్థములున్నవి. కొండవూటస్రవించి అంతర్వాహినిగ స్రవి తీర్థములోను కనియుచున్నది. తీర్థము లన్నిటిమీదను సూర్యరశ్మి తగులకుండ పైనకప్పులు వేయబడినై. తీర్థములన్నియు మోకాటిలోతు కల వియె. దీనివలన ననారోగ్యములను ననిచెప్పుట కవకాశము లేదు. ఉదయము లు చల్లదనము గలిగి నిర్మలముగ నున్నవి. ఆలయము ద్వారా సంవత్సర మొదటింటికి రూ 18000 పదునెనిమిది వేల రూపాయ లాదాయము లభించు చున్నది. దానిపై నధికారము గల కందనూరు నవాబు దేవాలయము యొక్క బాగోగులు చూచుటలేదు. ఇతరుల ధనము వెచ్చించి మరమ్మత్తులు చేయించి

నను నవాబుగారు వానిపై వచ్చెడి ఆదాయమును పుచ్చుకొనుట తప్ప పరామర్శనలు సేయుటలేదు.

నవాబుగారి యీవర్తనమున కామోదింపని రాజా చందులాలాగారు కొండవరకా క్షేత్రమున మరమ్మత్తులు చేయించియు వికసించుకొనుట జరిగింది. చందులాలు గారిపుడు ప్రతినిత్యము స్వామి కర్చునాదులు చేయించుటకుగాను నెల యొకటింటికి యింతయని వేతనము నియమించి యార్వురు బ్రాహ్మణులను పూజారులుగ నియమించారు.

ఆదికాలమున పరాశక్తి మహిషాసురుని వధించిన తరువాత భ్రమరాంబగా శ్రీశైలమందు వేంచేసినదని అచ్చటివారి నమ్మకము. మహిషాసుర వధ జరిగినది మైసూరు నందని పురాణప్రసిద్ధి. మహిషాసుర వధమె మైసూరుగ మారినదనియు జనవాక్యం. మహిషాసుర మర్దిని మైసూరు వచ్చినది—అనగ నామె మూలంబంటి యాతబడుచు. మేమీమె పుట్టింటివారమని మైసూరివారి చుట్టరికము చెప్పుకొనుచున్నది. ఆకారణముననే మైసూరు ప్రాంతీయుల కక్కడ హక్కులు చెల్లింపవలసిన పని యుండదు. జంగందేవరలకు, ఆరాధ్యులకు, బ్రాహ్మణులకుగూడ ఉత్సవాదులలో హక్కులుండవు.

ఆలయభాగంలో పెరిగిన యడవిని గొట్టించి బాగుచేయించిన వారెవరునులేరు. అటువులులకు యిటుపాములకు గూడ యీ యడవులు తావరములు కాగలవు. ఆలయపాలనాధికారులు భక్తాదులు స్వాములవారి పేరునందర్పించిన వస్త్రములు ఆభరణములు కానుకలు ముడుపుల నందుకొనుచున్నారు. అవి తరువాత కందనూరి నవాబుగారికి చెందుచున్నవనియు తెలిసుకొనిన వీరా

స్వామయ్యగారు భ్రమరాంబా మల్లికార్జున క్షేత్రము నుండి వెనుకకు తిరిగి భీముని కొలను మీదుగా బయలుదేరిన పెద్దచెరువు నగరకు వచ్చినట్లుగా వారి కాశీయాత్ర తెలియచేయుచున్నది.

# నవీనకాల ప్రయాణ సౌకర్యములు

త్రిపురాంతక ద్వారమున క్షేత్రములో ప్రవేశించిన తూర్పు ప్రాంతీయ యాత్రికులు తోకపల్లి డోర్నాలల మీదుగ పాతాళగంగకు చేరి అచటి నుండి మల్లికార్జునాలయమును దర్శించెదరు. ఈ మార్గము విజయవాడ మార్కాపురము నుండి పయనించు వారికి రైలు సౌకర్యము నీయగలదు. మార్కాపురము నుండి ప్రతిదినము ఉదయము 4. గంటలకు బయలుదేరు బస్సు పదునైదు గంటలు ప్రయాణము చేసి సాయంత్రం 7. గం. 20 నిమిషములకు శ్రీశైలము చేరుచున్నది. గుంటూరు నుండి ఉదయం 9. గంటలకు బయలుదేరు బస్సు యిరువది గంటలు ప్రయాణము చేసి మరునాటి ఉదయం 5. గంటలకు శ్రీశైలం చేరుతూంది.

సిద్ధవటం ద్వారమున క్షేత్రములో ప్రవేశించిన దక్షిణప్రాంతీయ యాత్రికులు గుంతకల్ కర్నూలు నంద్యాలల మీదుగ నాగులూరు చేరి బండ్ల మీద పెదచెఱువును సమీపించి అచటినుండి పదిమైళ్ళు కాలినడకతో శ్రీశైలమును చేరవలయును.

నంద్యాలకు కర్నూలునుండి గుంతకల్ నుండియు బస్సులున్నవి. వానిలో ప్రతిదినము కర్నూలు నుండి ఉదయం 5 గంటలకు బయలుదేరు బస్సు యెనిమిది గంటల పదునైదు నిమిషములు ప్రయాణము చేసి మధ్యాహ్నం 12 గంటల 15 నిమిషములకు శ్రీశైలం చేరుతుంది. నంద్యాల నుండి శ్రీశైలమునకు సరాసరి బండ్లు లేనందున నంద్యాల నుండి వచ్చెడి యాత్రికులు వారికి నలుబది మైళ్ళ దూరమున నున్న మహానందికి చేరి మహానంది నుండి ఉదయం 5 గంటలకు బయలుదేరు బసులో 7. గంటల 20 నిమిషములు ప్రయాణం చేసి మధ్యాహ్నం 12 గంటల 20 నిమిషములకు గమ్యస్థానం చేరవలయును. అదిగాక మహానందిలో మధ్యాహ్నం 1. గంటకు బయలుదేరు రెండవ బస్సులోనైనను 8 గంటలు ప్రయాణం చేసి రాత్రి 8 గంటలకు శ్రీశైలం చేరవచ్చును. గుంతకల్ నుండి ఉదయం 6 గంటలకు బయలుదేరిన బస్సు పదకొండు గంటలు ప్రయాణం చేసి సాయంత్రం 5. గంటలకు శ్రీశైలం చేరుచున్నది.

అలంపురం ద్వారమున క్షేత్రములో ప్రవేశించిన పశ్చిమ ప్రాంతీయ యాత్రికులు యీ అలంపురం నుండియే శ్రీశైల శిఖరమును దర్శించెదరు. వీరును వారివారి గ్రామముల నుండి రైలు మార్గమున కర్నూలు గాని నంద్యాలకు గాని వచ్చి అచ్చటి నుండి బస్సు ప్రయాణంలో శ్రీశైలమును చేరుచుందురు.

ఉమామహేశ్వర ద్వారమున క్షేత్రములో ప్రవేశించు ఉత్తర ప్రాంతీయ యాత్రికులు గూడ అచటి నుండియే శ్రీశైలమును దర్శించెదరు. వీరు

నాగరకర్నూలును చేరి అచటి నుండి తెలిక పల్లెకు పోయి చుక్కల పర్వతం మీదుగ శ్రీశైలమున కేతెంచెదరు. నేటి వర్తమాన కాలమున యీ తెలంగాణా ప్రాంతీయ భక్తాదులు రైలు మార్గమున కర్నూలు చేరి అచటి నుండి బస్సు ప్రయాణంలో మల్లికార్జున క్షేత్రమును దర్శించుచున్నారు.

భ్రమరాంబా మల్లికార్జున స్వామిక్షేత్ర మనంబడు శ్రీశైలము మీది సమతలము మున్నూరామడల వరకును వ్యాపించి యున్నది. ఈక్షేత్రమున కెనిమిది దిక్కులందున త్రిపురాంతకం సిద్ధవటం అలంపురం ఉమామహేశ్వరం ఏలేశ్వరం సోమశిల పుష్పగిరి సంగమేశ్వరం అను ఎనిమిది పుణ్య క్షేత్రము లున్నవి. ఎటునుండి వచ్చిన వారికైనను శ్రీశైల మొక కేంద్ర శివక్షేత్రమై యున్నది.

క్రీ.శ. 1950 వ సంవత్సరం వరకును శ్రీశైలయాత్ర మిగుల భయంకరమై యుండెడిది. మార్గ మడవిదారి. దట్టమైన చెట్లు గుట్టలు దొంగలకే గాక పులులు చిరుతలు మొదలైన క్రూరమృగములకు గూడ నిలయములు. ఒక్కొక్కప్పుడు పాములవలనను యాత్రికులకు ప్రమాదములు సంభవించు చుండెడివి. రాతిగుట్టల చాటున చెట్లపొదల చాటున మాటువేసి యున్న దొంగలు బాటసారుల గొట్టి ధన మపహరించుటయె గాక చిత్రహింసల పాలానరించుచుండెడివారు. కాని ప్రస్తుతము రాజమార్గములు నిర్మింపబడినందున—విద్యుద్దీపములు వెలుగుచున్నందున-యంత్ర వాహనముల రహదారు లేర్పడినందున—ప్రభుత్వం వారి రక్షణా విధానములు జాగ్రత్తగా జరుగు చున్నందునను వెనుకటి బాధ వేమియును లేక యాత్రికులు సుఖ సంతోషాలతో ప్రయాణాలు చేస్తున్నారు.

శ్రీశైలంలో ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమాలు సందర్భంగా జరిగే నూతన సంవత్సర వైభవాలకు కన్నడ దేశం నుండి కొంకణ ప్రాంతాల నుండి భక్తులు యాత్రికులు రావడం—మాఘ బహుళ చతుర్దశీలు సందర్భంగా జరిగే మహాశివరాత్రి వైభవానికి ఆంధ్రప్రదేశ ప్రాంతీయులు యాత్రలు చేయడమున్ను పరిపాటిగ జరుగు తున్నవి. శ్రీశైలభ్రమరాంబా సమేత మల్లికార్జున స్వామి క్షేత్రమునందు వార్షికములుగా జరిగే యుత్సవాలలో యీ రెండును ముఖ్యముగా చెప్పకొన దగినవై యున్నవి.

## శివలింగముల మయము-శ్రీశైలము

పూర్వకాలంలో దేవతలకు రాక్షసులకు యుద్ధాలు భయంకరంగ జరిగినై. నిజానికి వారిరువురు అన్నదమ్ముల సంతతివారే. ఈ దేవదానవులకు కశ్యపప్రజాపతి మూలపురుషుడు. ఐనా మొదటనుండి వారికి తగాదాలే. వారిలో దేవతలకు పట్టువిడుపు లున్నవి కాని, రాక్షసులు పట్టుదల కలవారు. ఒక రకంగ యెంతమంచి వారో యింకొకరకంగ అంత చెడ్డవారు కూడ.

ఆ రాక్షసులలో ముగ్వురన్నదమ్ము లున్నారు. ముగ్వురు గూడ బ్రహ్మదేవుని గురించి ఘోరమైన తపసులు చేశారు. వారి భక్తి విశ్వాసాలకానందించిన బ్రహ్మ ప్రత్యక్షమై "మీకేమి వరాలు కావాలనో అడగండి. ఇయ్యడానికే వచ్చా" నన్నాడు. వారు ముగ్వురును చేతులు ముకుళించి

"మమ్ము చంపే యీయుద్ధం నీసృష్టిలోనే లేనివర మిమ్మన్నా"రు. బ్రహ్మ సరేనన్నాడు. రాక్షసులు తిరిగి "మేముండే మా నగరాలు మేము దేవతలకు కనపడకుండ యుండా" లన్నారు. బ్రహ్మ సరేనన్నాడు. సోదరులు మళ్ళీ "మేము శైవులం కనుక మా పురాలలో ప్రతియింటా శివలింగాలుండా" లన్నారు. బ్రహ్మ దానికి గూడ సరే నన్నాడు.

రాక్షసులు పొంగి పోయారు. ఇటు భూమికీ కాక అటు గగన మండలాన కాకుండ మధ్యనున్న వాయుమండలం దాటాక మూడుపురాలను నిర్మించుకున్నారు. ఆ నగరాలు మూడున్ను సున్నం మన్ను రాలతో గట్టినవి కావు. ఉక్కు యిత్తడి కంచు లాంటి లోహాలతో యెటువంటి ప్రమాదములు సంభవింప కుండ గట్టిచేయబడినై. రాక్షససోదరు లక్కడనే రాజ్యాలను స్థాపించుకున్నారు. కొప్పురాలు పెట్టుకున్నారు. సైన్యాలను సమకూర్చుకున్నారు. వారికి బుద్ధిపుట్టినప్పుడు అమాంతంగ భూలోకం మీదనో, స్వర్గలోకం మీదనో, యింకెవరి మీదనో దాడి చేయడం-అక్కడున్న వారిని చిత్రహింసలు పెట్టడం జరుగుతూంది.

అసలే బ్రహ్మచేత వరములు పొందిన రాక్షస రాజులు. అటుమీద వారి నగరాలు లోహనిర్మితములు. అందుకు తోడు వారియింటింటా శివలింగములున్నందున వారాడినదాట—పాడినది పాటలైనవి. వారికెదురు లేదు. దారి దోవలు తోచని దేవతలంతా బ్రహ్మదేవుని యొద్దకు పోయి మొరబెట్టుకున్నారు. బ్రహ్మకు మతిపోయింది. వారందరినీ వెంటబెట్టుకుని విష్ణులోకం పోయి చెప్పుకున్నాడు. విష్ణుమూర్తికి గూడ యిది గడ్డు సమస్య అనిపించింది.

వారంతా కైలాసానికి పోయి సాంబశివునితో చెప్పుకుని "యీ యుపద్రవము నెట్లయినా నీవే తప్పించా" లన్నారు. శివుడు కొంచెం సేపాలో చించాక "సరే నేనా ముగ్గురు రాక్షసుల నంహరించి మిమ్ము కాపాడుతా" నని వారికి మాట యిచ్చాడు.

తరువాత శంకరుడు నందివాహన మెక్కి వాయుమండలంలోనికి పోయి చూచాడు. రాక్షసులు ముగ్గురూ ఆయుధాలతో చచ్చేవారు కాదు. రుద్రుడంతట మహోగ్రరూపం దాల్చి మూడవ కన్ను తెరచి మహాగ్నిజ్వాలల ప్రజ్వలింప చేశాడు. శివుని కంటిమంటలు ప్రళయాగ్ని రూపం దాల్చి మూడు పురాలను భస్మంచేసినై. ముగ్గురు రాక్షసరాజులు వారి వారి పరివారాలతో గూడ మాడిపోయారు. అదిచూచిన దేవమునీంద్రాదు లందరూ సంతోషించారు. మూడు పురములను కాల్చివైచినందున పరమేశ్వరుని "త్రిపురాంతక" అని స్తుతించారు—దేవమునీంద్రులంతా.

ఆసమయంబున రాక్షసుల యిండ్లలోని శివలింగము లన్నీ చెల్లాచెదరై పోయినందున పరమేశ్వరుడు "వానిని చూచి మీరంతా శ్రీశైలంమీద నిలిచి పొండి" అని చెప్పాడు. ఆకారణమున విశాలమైనదియు, పవిత్రమైనదియు, మహామహిమాన్వితమైనదియు నైన శ్రీశైలము మీద కోట్లసంఖ్యలో శివలింగము లవతరించి ప్రకాశించుచున్నవి. సాంబశివుడే తన ప్రతిరూపము లైన లింగముల నిండుండ నియమించి నందున శ్రీశైలము పార్వతీ పరమేశ్వరుల కత్యంత ప్రియమైన క్షేత్రమని తెలియు చున్నది. అట్టి మహా మహిమంబులు గల శివలింగము లసంఖ్యాకముగ నున్న శ్రీశైల శిఖరము చూచినంతనే ముక్తి గలుగు ననుటలో నమ్మరాని దంటూ యుండదు.

# శ్రీశైల క్షేత్రమందలి మహోత్సవములు

శ్రీశైల మల్లికార్జున స్వాములవారి సన్నిధానము నందు ప్రతిసంవత్సరమును బహుళ త్రయోదశి యైన మహాశివరాత్రి సందర్భము నను-ఆంగ్లేయుల గణితము ననుసరించి ప్రతిసంవత్సరం జనవరి 14వ తేదీకి సరిపడి వచ్చుచున్న మకరసంక్రాంతి పర్వదినము నందును స్వాములవారికి మహోత్సవములు జరుగుచున్నవి. ఆంధ్ర కర్నాటక ద్రావిడ మహారాష్ట్ర ప్రాంతముల వారికిది ముఖ్యమైన శివక్షేత్రం. పూర్వకాలమున ప్రయాణ సౌకర్యములు లేకయు అన్నపాన నివాస వసతులు లభింపకయు, చోరమృగ భయముల చేతను వచ్చెడి యాత్రికుల సంఖ్య పరిమితముగనే యుండెడిది. తిరునాల సమయములలో గాక యితర కాలము లందు జనసంచారము కొద్దిగనే యుండెడిది. నేటి అధునాతన సౌకర్యము లభివృద్ధి చెందుచున్న కొలది నాడు నేడనబోక యేనాడును యాత్రికుల రాకపోక లధికముగ జరుగుచున్నవి.

కార్తీకమాసము వలనే మాఘమాసము శివున కత్యంత ప్రియమైనది మహాశివరాత్రి పవిత్రమైనదినం. పార్వతీ సమేతుడై యున్న పరమేశ్వరం డొకానొక సమయంబున "శివరాత్రి పుణ్యకాలమున భక్తివిశ్వాసాభిమానములతో నన్నారాధించిన భక్తులకు వారి జన్మజన్మాంతర పాప పంకిలమునంతా కడిగివైచి వారికి శివసాయుజ్యమును ప్రసాదించెద" నని బ్రహ్మాది దేవముసీంద్రులతో చెప్పినని మహనీయులు మనకు తెలుపుచున్నారు. మహా

శివరాత్రి అక్కడ జరిగే యుత్సవములతో పాల్గొనడానికి యిచటి వేడుకలను నయనానందకరముగా చూచి సంతోషించుటకునుగాక యధార్థమైన భక్తిశ్రద్ధ పత్తులతో మహాదేవునారాధించుటకు: అభిషేకించుటకు, ప్రార్థించుటకు యెందరో యాత్రికులు వచ్చుచున్నారు.

నూతన సంవత్సరాది పండుగగ పరిగణింపబడెడి చైత్రశుద్ధ పాడ్యమాలు లగాయతు శ్రీరామనవమి యని చెప్పబడుచున్న చైత్రశుద్ధ నవమీలు పర్యంతం శ్రీశైలక్షేత్రమున చండీయాగం మహావైభవంగ నిర్వహింపబడుతూంది. యజ్ఞంలో వేదపండితులు హోమాదులు చేస్తారు. అందెందరో భక్తాదులు విరాళములు, కానుకలిచ్చి సహకరిస్తారు. విశేషంగా అన్నదానం జరుగుతూంది. అదిగాక ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమీలున భ్రమరాంబా దేవ్యాలయమున కుంభోత్సవమతి వైభవముగ జరుగుతూంది. ఈయుత్సవములలో కన్నడదేశీయు లధికముగ పాల్గొను చున్నారు.

నూటెనిమిది గజముల క్రొత్త గుడ్డను నందిముఖ మండపము చుట్టును కట్టియుంచి శివరాత్రినాడిచట జరిగెడి కార్యక్రమము లన్నియు పూర్తి యైన తరువాత నందిమంటపము చుట్టును చుట్టియుంచిన వస్త్రమును దీసి ముక్కలు చేయుదురు. వానినచటి ప్రముఖ భక్తులకు మాత్రమే పంచియిచ్చెదరు. దీనికి అమలకలపాకా యుత్సవమని పేరు. ఎచ్చటను, ఏయాలయమందును యేస్వాముల వారికిని లేని ధూళిదర్శనోత్సవ మిచ్చట జరుగుచు

